# దీపావళి



పలసాని రామారాయ్

విజ్ఞాన సాహిత్యవనం
బెజవాడ

ప్రథమ
కుసుమము

# దీపావళి

చలసాని రామారాయ్

మే డే
౧౯౪౧



వెల
ఆరణాలు

# విజ్ఞాపన

నేడు చిన్నకథలు సాహిత్యంలో ఒక ముఖ్యస్థానం ఆక్రమించినై. అందులో నాకుకూడ కొంత పరిచితి కలిగింది. ఈచిన్నకథలు వ్రాయటం 1938 లో ప్రారంభించాను. తగినంత ప్రోత్సాహంలేకనూ, సంస్కారం - ధైర్యం లేకనూ, 39 వరకు అలాగే మూలపడేసి అట్టిపెట్టాను. అదృష్టవశాత్తు 1940 లో నాకథలు ప్రకటించగలిగే అవకాశం చిక్కింది. కాని దురదృష్టమే నని యిప్పుడు నిందించుకోవాలిసి వస్తోంది, నేను చేసికొన్న తెలివితక్కువ పనివల్ల. ఏది యెలాగున్నా బయటపడ్డాను. కొంతధైర్యం చిక్కింది. ఇప్పుడు మళ్ళీ యీపుస్తకం ప్రకటిస్తున్నాను.

ఈపుస్తకంలో సంఘంలోవున్న క్రుళ్ళను నాలుగురకాలుగా చూపించి వాటి నివారణమార్గాలుకూడ చూపించాను. ఎంతసేపు ఆక్రుళ్ళను కెలకటమే పనిగా గాకుండా వాటికి తగిన నివారణోపాయాలు వెదికి సంఘాన్ని మంచిమార్గంలోకి తేవాలి యువతీయువకులంతా. అలా కావాలంటే ధైర్యం కావాలి. బానిసభావాలతో మాడిపోకుండా స్వతంత్రభావాలతో నూతనోత్తేజం కలిగి ధైర్యంతో ముందు కడుగు వేస్తేనే ముక్తి. అందుకోసం యువకులు నడుము కట్టాలి. పనిచేయాలి. మెదలక వూరుకోకూడదు.

మనసంఘం, మనస్థితి, మనకర్తవ్యం అంతా 'సాంఘిక విప్లవం' అనే పుస్తకంలో విపులంగా వ్రాశాను. విప్లవమంటే ప్రభుత్వం విరుచుకు పడుతుంది మీద, అందులోని అర్థం తెలియక. విప్లవమంటే యేమిలేదు కంగారుపడవలసినంతగా. విప్లవమంటే మార్పు. ప్రతిదేశానికి, ప్రతి కాలానికి మార్పు అవసరం. Change is the law of nature అన్నాడు ఒకాయన. ఇంకొకాయన Old order changeth yielding place to new అన్నాడు. అలాగే మార్పు అవసరం యెప్పుడూకూడ. దేని నాపినా కాలాన్నాపలేరుగా !

రచయిత.



" వెంకటరత్నం బహుదుర్మార్గుడు. వాడేకదూ తాను యీవేళ యీ దీనస్థితిలో వుండటానికి కారణం! తాను యెంత బ్రతిమాలినా కాలేజి అధికారులు తనమాటను లెఖ్ఖచెయ్యలేదు. ఎందువల్ల తనకీ దుస్థితి రావాలి? తనకుకూడా ఆ స్థివుంది. పూర్వం తండ్రి బ్రతికివున్నరోజుల్లో యెంత ప్రేమగాచూచేవాడు? ఎంతో వైభోగంగా పెరిగాడు. ఇప్పుడీ వుపవాసాలజీవితం యెందుకు? అనవసరమైన అధికారినీ వెళ్లి యాచించటం దేనికి? తనలాటి కష్టాలు వాళ్ళకు వస్తే యెంత ఆదుర్దాపడతారు? తనకు ఆ స్థితిలేకపోబట్టి బంధువు లెవ్వరూ చూడరు. తల్లీతండ్రి వుండగా యెంతమంది బంధువులు వచ్చేవాళ్ళు! ఇప్పుడు ఒక్కరూ పిలవరు. ఇంత హీనస్థితికి కారణం యెవరు? తాను యెంత నికృష్టజీవనం గడుపుతున్నా యెవరికీ జాలిలేదు. మళ్ళీవెళ్ళి ప్రిన్సిపాలును కలుసుకొని మాట్లాడాలి " అని అనుకొంటూ కాలేజిగేటులో నుంచొని ఆలోచిస్తూ విచారపడుతున్నాడు పాపం, గోపాలరావు.

" మాష్టారూ! ఈతఫాకు excuse చెయ్యండి. వచ్చే టెరమ్‌లో కట్టుకొంటాను, యెలాగో తంటాలుపడి. "

" ఓ! మళ్ళీ మొదలుపెట్టావ్? ఎన్నిసార్లు చెప్పాలోయ్ నీకు? తప్పదు. వచ్చే టరమే ముంది? Next year కేగా! "

"అవునండి. ఇప్పు డన్యాయంగా యీ సంవత్సరమంతా వృధాగా పోతుందండి, పరీక్షకు వెళ్లనీయకపోతే! క్షమించండి."

"లేదు. అన్యాయ మేమిటోయ్ ? అసలు డబ్బులేకపోతే కాలేజికి రాగూడదు. ఈ వెధవపేచీలన్నీ యెవడు పట్టాడు. అసలు డబ్బులేకపోతే జేర్చుకోకూడదు న్యాయంగా తెలుసా?"

"............"

అతిదీనంగా ప్రిన్సిపాలువ్యాఘ్రంవంక చూస్తున్నాడు గంపెడాశతో. కాని ఆ పాషాణహృదయం యీ నిర్భాగ్యుడి దీనదృక్కులకే కరగుతుందా? వాళ్ళవిమాత్రం మానవ హృదయాలు కావూ? షాహుకార్లబ్బాయిలు వృధా వ్యయానికి డబ్బు యివ్వకపోతే అలుగుతారు. తిప్పలుపెట్టి గుంజుతారు డబ్బు. దుబారాఖర్చు చేస్తారు. ఏమిలెఖ్ఖ వుండేదు. జీతం కట్టుకోవటానికి బ్రతిమాలుకొన్నా యీ అధికారిహృదయం కరగటం లేదే? ఉపాధ్యాయులు విద్యార్థులు తండ్రికొడుకుల సంబంధంతో మెలగాలి అని వుపన్యాసాలు దంచుతారే, వ్రాకదాపుడు! ఈ మాత్రం సహాయం చేయలేరూ ? ఎప్పుడు ఏరు చేసేసహాయం? వృధాగా గోపాలరావుజీవితం నాశనమైపోతుందే? ఎవరికి జాలి?

"ఇంకా యెందుకోయ్ నిలుచున్నావ్?"

"మీ రిలా అంటే యెలాగండి? ఈ సంవత్సరం వృధాగా పోవలసిందేనా? ఇంక నేను చదవలేనండి మాష్టారు! క్షమించండి."

"ఇదిగో గోపాలరావు! డబ్బు లేకపోతే కాలేజీకి రావటమే మానెయ్యలేక పోయావా? ఇప్పుడు అనుకొంటే లాభ మేమిటి?"

"మీ మాటే మీదిగాని మా కష్టసుఖాలు ఆలోచించరన్న మాట? ఎంత ధనహీనుణ్ణయినా నాకుకూడ మానాభిమానా లున్నాయ్. కాస్త కనికరించండి. వృథాగా నా జీవితాన్ని నాశనం చేయకండి మాస్టారూ!"

"ఏయ్! జాగ్రత్తగా మాట్లాడు. ఏమనుకొన్నావ్? Foo!"

"జాగ్రత్తగానే మాట్లాడుతున్నాను లెండి. చాల జాగ్రత్తగా వున్నాను."

కోపము మండుకుపోతోంది. బాధ లెక్కువై పోతున్నయ్. ఇంకా తాను బ్రతికి యేం సంపాదించగలడు? 'నిర్ధనుడికి యెక్కడా తావులేదా? ధనం ఒక్కటేనా మానవుని యోగ్యతా యోగ్యతలు నిర్ణయించే శక్తిగలది? శుద్ధ వెర్రిపశువైనా డబ్బుండగానే గొప్ప విజ్ఞానవంతుడు, పెద్దమనిషి అవుతాడా? ఎంత విజ్ఞానవంతుడైనా, తెలివిగలవాడైనా డబ్బులేకపోతే యెందుకూ పనికిరాడా? ఇంతకూ దీనికి కారణం వెంకటరత్నం. వాడే! ఆ దుర్మార్గుడే!! ప్రాణానికి తెగించాడు. ప్రిన్సిపాలు తనకు కాలేజిలో జేరటానికి అనుమతి యిస్తాడా, యివ్వడా? ఇవ్వకపోతే అడగవలసిన నాలుగు మాటలు అడిగిపోతాను. ఎలాయినా ఒక్కటే! శక్తికొలదీ ప్రయత్నం చేశాను. లాభం లేదు యింక!

"దయచేసి వెళ్ళు గోపాలం!"

"మాష్టారూ! వెళ్తాను కాని, మీతో మాట్లాడటానికి నాలుగు నిముషాలు టైము యివ్వండి. ఇదైనా అంగీకరించండి."

"సరే, యేమిటో చెప్పు!"

"నేను చాల పేదవాణ్ణి. ఎవర్నీ యేమి చెయ్యలేను. ఈరోజుల్లో మనిషియొక్క విలువంతా డబ్బుతో వుందికదూ? నా జీవితాన్ని మీరు యీ ఒక్కరోజుతో, యీ ఒకగంటతో మార్చేస్తున్నారు కదూ? నా కిష్టమే కాని యిదే మీ బంధువు లైనా, మీ అబ్బాయేయైనా యిలా జేయగలరా? ఎవరైన చేస్తుంటే వూరుకోగలరా? మీది మానవహృదయం కాదూ? మనిషిజన్మ యెత్తలా? ఎందుకు నీ చదువు? నేను ఫూల్నా? నేను యెలాగో చదువుకొంటానని ఆశలేదు. ఇవ్వాళ్ళకాకపోతే రేపైనా మానెయ్యవలసినవాడినే. ఈచదువు దినదినగండం నూరేళ్లాయు వన్నట్టుగా వుంది. ఇంకెవరినీ యింత నీచంగా చూడకండి. అందరికీ మానాభిమానా లుంటై. నాజాగ్రత్తే అయిపోయింది. మీరు జాగ్రత్తగా వుండాలి. శెలవు మీకు, మీ కాలేజికీ."

అని కండగడలాగ యెఱ్ఱబడ్డ ముఖంతో వెళ్ళిపోయాడు. ప్రిన్సిపాలుగారు ఆశ్చర్యచకితుడై అతను పోయినదారినే చూస్తు న్నాడు. ఎవ్వరూ యేమి మాట్లాడలేకపోయారు, గోపాలరావు మాట్లాడినంతసేపున్నూ. అతను వెళ్లిపోయింతర్వాత అందరూ

అతని ధైర్యాన్ని మెచ్చుకొనేవాళ్ళు, జాలిపడేవాళ్ళు, కోపపడే వాళ్ళు. ఉండగా ఒక్కరూ మాట్లాడలేదు.

౨

వెంకటరత్నం గోపాలరావుకు దూరపుబంధువు. బంధుత్వమంతా తిరుగవేస్తే వేలువిడిచిన మామ అవుతాడు. వీళ్ళ కుటుంబానికి శనిలాగ దాపురించాడు. హనుమంతరావుగారు మధ్యరకపు రైతుల్లోవాడు. కొంచెం ఎలుకుబడి గల పెద్దమనిషి. పిల్లలెవ్వరూ లేకపోవటంవల్ల గోపాలరావును యెంతో గారాబంగా పెంచాడు. కాని నేడు యీ దుస్థితి తప్పలేదతనికి.

వెంకటరత్నం నెమ్మదిగా వీళ్ళయింట్లో జేరి హనుమంతరావుగారిచేత నాటకాలకంపెనీ ఒకటి పెట్టించాడు. కొంత కాలం సవ్యంగానే జరిగింది వ్యాపారం. నెమ్మదిగా వెంకటరత్నమే దానికి స్వంతఅధికారం సంపాదించాలని అందులో వున్న భాగస్థులతో చేరి కుట్రపన్ని హనుమంతరావును మోసగించి ఆకంపెనీ అధికారం కాజేశాడు.

ఈ కుట్ర హనుమంతరావుకు తెలియదు పాపం! దాన్తో చాలవరకు నష్టపడ్డాడు. మళ్ళీ మోటారుబస్సుల సర్వీసుపెట్టి మిగిలినది కాస్త అమ్మించాడు. ఈ మధ్యలో యింకా కొన్ని నాటకాలాడి హనుమంతరావుకు చిప్పచేతికిచ్చాడు. చివరివరకు ఆతన్ని నమ్ముతూనే వున్నాడు, పాపం! హనుమంతరావు.

చివరకు గోపాలరావును చదివించటానికికూడ డబ్బులేక పోయింది. గోపాలరావు తల్లి క్షయవ్యాధితో బాధపడి యీ లోకాన్ని విడిచిపెట్టేంచి. ఆమెకు మందిప్పించటానికికూడ డబ్బు లేకపోయింది. ఎవ్వరూ అప్పు యివ్వరు. వెంకటరత్నం మాట్లా డడు. ఆ నికృష్టపు సంసారంలో ఆమె యెక్కువకాలం బ్రతక లేకపోయింది. ఆరునెలలు జరుగకపూర్వమే హనుమంతరావు మనోవ్యాధితో భార్యను కలుసుకోవటానికి పోయాడు.

అప్పటినుంచి గోపాలరావుకు దిక్కు మొక్కు లేక పోయింది. బంధువు లెవ్వరూ ఆదరించలేదు. నా అన్నవా ళ్ళెవరూ లేకపోయారు. చందాలడబ్బుతోను, వారాలభోజనాల తోను యిప్పటివరకు చదువు సాగించాడు. ఆవేళ యీ పరా భవం జరిగింది. ఇప్పటి కెన్నోసార్లు ఇటువంటి అవమానాలు పొందాడు కాని అంతబాధ పడలేదు తన దురవస్థకు కారణం? వెంకటరత్నం!

## 3

ఎక్కడో మారుమూలలో వున్న చిన్నగదిలో చింకి చాపమీద పడుకొని ఆలోచిస్తున్నాడు గోపాలరావు. ఉన్న కొద్దిపుస్తకాలు చిందరవందరగా పడివున్నై. దారినిపోయే బాటసారికి కూడ గోపాలరావు గదిలో వున్నదానికంటె యెక్కువ సామాను వుంటుంది. ఒక చిన్న పెట్టె, పుస్తకాలు. రెండు

తుండుగుడ్డలు దండెంమీద వ్రేలాడుతున్నై. ఒక పగిలిపోయిన అద్దం, సగం విరిగిన దువ్వెనమాత్రం అతని సంసారమంతా. గదంతా దుమ్ముకొట్టుకొని వుంది. ఆ చాపలో యెన్ని జీవరాసులు కాపుర ముంటున్నయ్యో? పేదవాళ్ళల్లో వున్న గొప్పతనమే అది! వాళ్ళకేగాకుండా అనేక జీవాలకుకూడ ఆశ్రయం లభిస్తుంది.

తన గతజీవితాన్ని తలచుకొని దుఃఖిస్తున్నాడు. అతనికి యేంచెయ్యడానికీ పాలుపోవటంలేదు. పేదవానికోపం పెదవికి చేటు. ఎవ్వరి నేం చెయ్యగలడు? తనవల్ల నేమవుతుంది? ఇంకా బ్రతికిమాత్రం యెవరి నుద్ధరిస్తాడు? ఆజీవితం నిరర్థకం. కాని తానుపోయేముందు- తనజాతి నశించేముందు- తను చేయవలసిన మహాత్కార్యం ఒకటుంది. అది మంచిదైనా చెడ్డదైనా విచారంలేదు. ఆకార్యంమాత్రం జరగాలి. తరువాత తా నేమైపోయినా సరే, చింతలేదు. తనపతనానికి కారణబీజాన్ని మొదలంట నిర్మూలం చెయ్యాలి. అప్పుడుగాని హాయిగా నిద్రపట్టదు. కడుపులో మాడుతున్నా నిద్రపట్టుతుంది. ఆ కార్యసాధనే అతనికి భోజనం. తరువాత తాను యిక్కడ వుండొచ్చాలేదా? ఉంటే తర్వాత చూచుకోవచ్చు!

ఆ రాత్రి నిద్రలేదు పాపం! అనేక ఆలోచనలు శరవేగంతో పరిభ్రమణం చేస్తున్నయ్, మనోవీథిలో. భావశకటాలు ఢీకొంటున్నయ్. బద్దలై పోతున్నయ్ కొన్ని. మనస్సంతా చిందరవందరగా వుంది. ఎలాగో తెల్లవారింది.

ఆ మరునాడు బయలు దేరాడు స్వగ్రామానికి కార్య సాధనకోసం. ఎన్ని కష్టాలైనా యెదుర్కొంటాడు. ఎదుర్కొగలడు. అక్కడ యెవ్వరూ ఆదరించేవాళ్ళు లేకపోయినా తన అవసరంకొద్దీ వెళ్లాలి సొచ్చింది. కావలసిన సరంజామా సమకూర్చుకొన్నాడు.

## ౪

అతిప్రయాసమీద వెంకటరత్నంమంచందగ్గరకు జేరాడు గోపాలరావు. పూర్వం వెంకటరత్నం పూరియింట్లో కాపురం చేసేవాడు. ఎంతో నికృష్టంగా గడిచేది కాపురం. ఇప్పుడు యింటిమీద యిల్లొచ్చిపడిన తర్వాత పెద్దవాడయ్యాడు. కొద్దిపాటి మేడవేసుకొన్నాడు. ఇప్పుడు తరహా అంతా వేరు. నవనాగరిక లక్షణా లనుకొనే సామగ్రి అంతా కొన్నాడు. సిగరెట్లు కూడ అలవాటుచేసుకొన్నాడు. బెంగాలీ లాల్చీలు వేస్తాడు. చేత గడియారం, గ్రామఫోను యింట్లో. అంతా ఒక నవనాగరిక శిరోమణిలాగ తయారౌతుంటాడు. ఆయనముందు యెవ్వరూ మాట్లాడలేరు. పెద్ద విజ్ఞానవేత్తలాగు మాట్లాడుతాడు. అంతా తనకే తెలుసు నంటాడు. పొట్టపొడిచినా అక్షరపుముక్క లేదు. ఎక్కడైనా దస్తూరికావలిస్తే నిజాని. ఏవో నాలుగు యింగ్లీషు ముక్కలు పట్టుకొని వుపన్యాసాలు దంచుతుంటాడు. ఎలాయినా యింకో యిల్లు కలుపుకొని మొనగాడైనాడు. దోమతెర పందిరి

మంచంలో పడుకొని హాయిగా గుర్రుపెడ్తున్నాడు మేడమీద గదిలో.

"వెంకటరత్నంమామా.!"

"......................"

"వెంకటరత్నంమామా !"

"........ఆఁ!........."

"లే ! కొద్దిగా పనుంది."

"ఆఁ ! ఎవరు ?"

"లే కాస ! పనుంది నీతో !"

"ఎవరు నువ్వు ?" గొంతునుబట్టి కంగారుగా లేచాడు. 'ఇంత యీఅర్ధరాత్రివేళ మాయింటికి అందులో నాగదిలోకివచ్చి తలుపుతియ్యకుండా లేవమంటున్నాడెందుకు ? అసలు యిప్పు డెందుకు వచ్చినట్టు? వీడు నన్ను యేమైనచెయ్యటానికి రాలేదు కద ! ఆ యేఁహ్యాడు ! వా డేమిటి, నన్నా ? అయినా లేచి మాట్లాడినందువల్ల వచ్చిన ప్రమాద మేమిటి ? అంతగా వస్తే గట్టిగా అరిస్తే యెవరైన రారూ ప్రక్కయింటిలోనుంచి ? అరే! ఇంట్లో యెవ్వరూ లేకుండ చూచి వచ్చా డెందుకు ? ఏమో వీడి దుంపతెగ !'

"ఎందుకురా గో......?"

"కళ్ళు నులుపుకొని కూర్చో మామా !"

"ఊఁ! ఎందుకు ?"

కళ్లు నలుపుకొని ఆవలిస్తూ కూర్చుని దోమతెర అడ్డం తీశాడు యింక మాట్లాడమని.

"ఇప్పుడు నే నెందు కొచ్చానో తెలుసా ?"

"ఎందు కొచ్చా ?"

"ఎంత హీనస్థితిలో నా బ్రతుకు గడుస్తోందో నీ కేమైన తెలుసా ?"

'ఆఁ! వీడు ముందుగానే యెత్తాడే ? అనుకున్నంత అయింది. ఆరి అఘాయిత్యపు గాడిదకొడకా! ఇప్పు డేం చేద్దామని వచ్చావురా ? ఏదో కుంభకోణం చేయటానికే వచ్చాడు. సందేహంలేదు. ఏది గతి యిప్పుడు ? ఏం చెయ్యాలి ? ఆఁ! అంతగా ప్రాణంమీదికొస్తే చూద్దాం ఫ్!'

"ఏమో? నా కేం తెలుసు?"

"అవును. నీ కేం తెలుస్తుంది? నీ కెందుకు నాజోలి? హాయిగా మేడ కట్టించావు. సుఖంగా మెత్తని పరుపులమీద దోమతెరలమధ్య కమ్మనిసుఖం అనుభవిస్తున్నావు. ఎవరెట్లాపోతే నీ కేం కావాలి? ఇంకా నా కేం తెలుసు నంటావ్? సిగ్గులేదూ మొఖానికి? జన్మ యెత్తావు యెందుకు పాడుజన్మ?......"

"ఆఁ! ఏమిటోయ్? ఆపు!

"ఏమి టాపేది? నేను అన్నం తిని యెన్నాళ్లయిందో నీ కేం తెలుసు? కడుపులో యెంత మండుకపోతోందో నీ కేమైనా తెలుసా?......" కంఠస్వరం వుద్రేకపూరిత మౌతోంది.

"ఎన్నాళ్లైందో నా కేం తెలుసురా? అసలు యిప్పుడొచ్చినప నేమిటి? చెప్పు, ముందు!"

"చెప్ప మంటావా?.........నీపాపిష్టిరక్తాన్ని నా కళ్ళార పారటం చూస్తేగాని నాకు యీ ఆకలి తీరదు. అందుకే యిన్నాళ్లనుంచి వుపవాస మున్నాను. ఈవేళ దరిద్రదేవతకు ఒక బలి యిస్తా నని ప్రతిజ్ఞచేసి వచ్చాను. ఆ ప్రతిజ్ఞ నెరవేర్చుకోవటానికి యిప్పుడు యిక్కడ కొచ్చాను. అందాకా శాంతిలేదు."

గొంతు వణుకుతోంది, శరీరమంతా కంపిస్తోంది. వెంకటరత్నం స్థితి నా కలం యిప్పుడు యిక్కడ వర్ణించలేదు, వర్ణించదు, కూడదు.

"ఏమిటీ?"

"నీ రక్తం బలిహోమానికి కావలసివచ్చింది మామా! ఈమాత్రంసహాయంచేయలేవాని వచ్చాను. నీవు చాల ధర్మాత్ముడ వట! బలిచక్రవర్తి, శిబి, కర్ణుడు యెవ్వరూ నీ ముందు నిల్వలేరట! మరి యిస్తే త్వరగా వెళ్తాను."

"............"

"వేళాకోళంకాదు మామా! నిజంగానే. యిప్పుడు యీ వూరి ప్రజలు, మానాన్న నన్ను యీ పని చెయ్యమని కోరితే యింతకష్టపడి నాప్రతిజ్ఞ చెల్లించు కోవటానికి వచ్చాను. నీ రక్తంతో దరిద్రదేవతను యజ్ఞంచేస్తే అశ్వమేధయాగం చేసి నంత పుణ్యమట! నామీద దయవుంటే యివ్వు, లేకపోతే నే నేం చెయ్యను?"

"............"

'ఎక్కడ నేర్చుకొన్నాడు యీ కవిత్వమంతా? ఈ అఘాయిత్యం చేయటానికి వచ్చి పైగా యేంచమత్కారంగా మాట్లాడతాడు? ఏదో శాస్త్రంచెప్పినట్లుగా వుందే వీడితరహా! సరే! ప్రాణంమీదికొస్తే యేం చేస్తాం? ఏదో సమాధానపరచి పంపాలి. తర్వాత వీడి భరతం పట్టాలి. అరివెధవ! నిన్నగాక మొన్న పుట్టాడు. వీడు నన్ను చంపటాని కింత ధైర్యంగావచ్చి, చెప్పి చంపుతాడా? ఆఁ!'

"నేను నుంచోలేను మామా! తొందరగా యిస్తే వెళ్తాను. యజ్ఞం తెల్లవారేటప్పటికి పూర్తికావాలి. త్వరగా చెప్పు."

"అబ్బాయ్! నీ కేం కావా లిప్పుడు? జీతం కట్టాలా? ఎంత కావాలి?"

"నా కిప్పు డేమి అవసరంలేదు. నేను చదువుకోవటం లేదు. నాకు కావలసిం దల్లా నీ రక్తమే!"

"కాదురా! ఒకవెయ్యిరూపాయ లిస్తాను. వెళ్ళు నాయనా! నన్ను చంపితే నీ కే మొస్తుంది?"

"............"

"నామాట విను. నన్ను వృథాగా చంపకు. నిన్ను, నీ మాటలు చూస్తేనే నా ప్రాణాలు పోయినై. చంపకు. కావలిసినంత డబ్బు యిస్తాను."

"ఊఁహూఁ! నా కేమీ అక్కరలే దని చెప్పలా? తొందరగా యివ్వు రక్తం. లేకపోతే యిదిగో నేను తీసుకొంటా!

"ఆఁ!.........ఆఁ!"

"పరమదురాత్మరుడా! ఇంక యెంతమంది కొంపలు తీయటానికి బ్రతకాలని వుంది? గాడిదకొడకా? నీవు నాకు మామవా? వెయ్యిరూపాయ లిస్తావ్? ఎవ్వడిఈతాత ముల్లె? నీ యబ్బసొమ్మా? నీకు యింతకంటె శిక్షలేదు. నీవు యింకా బ్రతుకగూడదు......ఇది నా మాతాపితరుల ఆజ్ఞ!...చావ్!"

"అమ్మాయ్!......అ......మ్మా!"

"............"

"............"

"ఊఁ! ఇప్పటికి నా ప్రతిజ్ఞ నెరవేరింది. నా క్షుధాగ్ని చల్లారింది......నావల్ల తప్పేమైనావుంటే అది వీడిపాపంలో ఒకభాగంమాత్రమే! నా కర్తవ్యం నెరవేరింది. ఇంక నేను చెయ్యవలసిం దేమి లేదు......ఆహా!"

వెంకటరత్నం మంచంక్రిందవున్న తాళపుచెవులు తీసుకొని యింట్లోవున్న యినుపపెట్టె దగ్గరకు వెళ్లాడు గోపాలరావు. ఆ పెట్టెలోని చెక్కులుచూస్తే అతనికి ఆశ్చర్య సంతోషాలు ముప్పిరిగొన్నై. నాలుగైదు కట్టలు తీసుకొని ఆ గుడ్డలు అక్కడే విడిచి మంచిగుడ్డలు తొడుగుకొని తన గుడ్డలు ఆ తొందరలో అక్కడే వదలి యింటికి తాళంపెట్టి తాళపుచేతులు మళ్ళీ యథాస్థానంలో వుంచి వెళ్ళాడు చీకట్లో యెక్కడకో!

౫

"Hollo! Mr. గోపాల్! ఎక్కడనుంచి యీరాక?"

"ఆఁ! మా...మా ఊరునుంచే!"

"ఏమోయ్! అలా వున్నావ్? ఆఁ?"

"                    "

"గోపాల్! అ దేమి టోయ్!"

"సరళా!...ముందు నన్ను యేగదిలోకైన తీసుకొని వెళ్ళు...తర్వాత చెప్తాను కథ. మీయింటికి యెప్పుడూ యింత చనువుగా రాలేదు...క్ష..."

"ఆఁ! ఆఁ! క్షమించటం దేనికి?"

"ముందు నన్ను యేగదిలోకైన తీసుకొనిపో!"

"ఇలారా!"

ఇద్దరూపోయి సరళగదిలో కూర్చున్నారు చెరి యొక కుర్చీలో. గోపాలరావుగుండె వందమైళ్ళ వేగంతో కొట్టుకొం టోంది. ఇంతవరకు ఆమెతో మాట్లాడలేదు. ఇప్పుడు యేం మాట్లాడాలో కూడ అతనికే తెలియదు. ఆమె పెద్ద ఆఫీసరు గారి కూతురు. ఇంతచనవుగా యెలా మాట్లాడింది! ఇద్దరూ క్లాసుమేట్సు అయినంత మాత్రాన యింత చనవుగా వచ్చి అందులో పెళ్ళికానిఆడపిల్లతో మాట్లాడి రక్షణఅవుగుతాడా? అస లెందుకు వచ్చాడు యిక్కడికి? ఆమె పెద్ద అధికారి కూతు రని తనచరిత్ర విని యేమైన సహాయం చేస్తుం దని ఆశ! పాపం! కాని ఆమె యెంతో చనవుగా మాట్లాడుతోంది. అందరూ మాట్లాడతారా? సరళయొక్క తత్వం యిప్పుడు కొంత వరకు తెలిసింది. ఎంతో భయపడ్డాడు. కాని యిక్కడకు రావటమే మంచిదయింది.

అతనిముఖంలో నిముష నిముషానికి సముద్ర కెరటాల వలె విషాదచ్ఛాయలు అలముకొంటున్నై. విడిపోతున్నై. చిత్ర విచిత్రంగా వుంది అతనిస్థితి. సరళ కేమి అర్థంకావటంలేదు. ఏమి అనుకోవటానికి వీలులేకుండ వుంది. అతన్నిగురించి యామె కూడ యెన్నో విధాలుగా అనుకొంటోంది. చివరకు సరళే కల్పించుకొని—

"ఏమిటోయ్? గోపాలరావ్! యిలావచ్చావు యివ్వాళ పొద్దున్నే? అలా వున్నా వేం?"

"..............."

"చెప్పకూడదా ?"

ఇంతచనువుగా సానుభూతిచూపిస్తూ మాట్లాడుతున్న ప్పుడు తనకేమిటి భయం? సంబాళించుకొని ధైర్యం తెచ్చుకొని లేనిసంతోషాన్ని యెఱువు తెచ్చుకొని—

"ఆఁ! ఏమీలేదు సరళా!......మీ ఇంట్లో ఎవరైన చూస్తే యేమైన అనుకొంటారేమో ?"

"ఫర్వాలేదు."

"నీతో యిదే ప్రథమం మాట్లాడటం. నా స్థితి నీ కిదీ వరకే తెలిసి వుంటుంది బహుశా!......నా స్థితి నీ కెలా తెలుస్తుంది ? చెప్తాను విను.

"ఇప్పుడా సోదంతా యెందుకూ ?"

"చెప్తున్నా విను......మాది ఒకప్పుడు బాగా బ్రతికీన కుటుంబమే! దురదృష్టవశాత్తు మా కొక దరిద్రపీనుగు దాపురించాడు. మా ఆస్థితో పాటు నా తలితండ్రులనుకూడ బలిగొన్నాడు. ఇంక నా అవస్థ యేం చెప్పను? చందాల డబ్బుతోను, వారాలభోజనంతోను గడుపుతున్నాను. మొన్న మన ప్రిన్సిపాలు జీతం కట్టలేదని కాలేజినుంచి వెళ్ళగొట్టాడు. నానా పిచ్చిమాట లన్నాడు. నాకు కష్టపుట్టి యేం చెయ్యటానికీ తోచక మా వూరు వెళ్ళి ఆ దుర్మార్గుణ్ణి హతమార్చి...కొంత డబ్బు తెచ్చాను. ఇదీ కథ! నీవే శరణు."

ఆమె ఆశ్చర్యంతో "ఆఁ! హత్యచేశావా?" అంది.

"అవును హత్యచేశాను. ఈ ప్రపంచంలో నాకు బ్రతక టానికి తావుదొరకలేదు. దొరక దని నాకు దృఢనమ్మక మేర్ప డింది. ఎన్నాళ్ళు యీ నికృష్టపుబ్రతుకు బ్రతకను? అర్హమైన వాళ్ళదగ్గరకూ వెళ్ళి యాచించలేకపోయాను. నా మనస్సు కరుడు కట్టింది అవమాన గాయాలతో ఎంత ఓర్చినా మొన్న ప్రిన్సిపాలుచేసినఅవమానం భరించలేకపోయాను. నాబోటిదరిద్రు లకు యాచనచేసినా, మర్యాదగాప్రార్థించినా యేమాత్రం లాభం కనపడేలా లేదు. ప్రతిమనిషి సుఖపడా లనే చూస్తాడుకాని నికృష్టపుబ్రతుకుబ్రతకాలని చూడడుగా! వీళ్ళంతాఅమాయకుల కొంపలు దోచుకొని పెద్దవా ళ్ళవుతుంటే వాళ్లగ తేమికాను? వా ళ్ళలా కృశించి కృశించి క్రుంగి నశించిపోవాలిసిందేనా? హత్య చేశానంటే చెయ్యనూ? వాడిని హత్యకాదు, యింకా యేం చెయ్యలేం, కాని......

దరిద్రులనేవాళ్ళకు బ్రతకటానికి ఆస్కారం లేనప్పుడు వాళ్ళు చావనైనా చావాలి లేకపోతే వాళ్ళ దరిద్రానికి కారణ మైన వాళ్ళనైనా చంపి అనుభవించాలి. రెండూ లేనప్పుడు కర్మకర్మ అని క్రుంగిపోవట మెందుకు? చేతనైతే అనుభవిం చాలి, లేకపోతే మరణించాలి. రెండూ లేకపోతే యెందుకు? ......సరళా! నీ వేమైన అనుకో! నాకు అంతకంటె మార్గం కనుపించలేదు. నా కక్ష తీరటమే కావలిసింది."

గోపాలరావు అలసిపోయాడు. రెండురోజులై ందిభోంచేసి పాపం! మాట్లాడలేక సొమ్మసిల్లి వుంది మనస్సు. బలహీనమైన శరీరంతో కూర్చోలేకుండ వున్నాడు.

సరళ అతనివంక తదేక దీక్షతో చూస్తోంది. 'పాపం! ఎంత తెలివిగలవాడు! అయితే మాత్రం యేలాభం? చదువు కోవటానికి డబ్బులేదు. ఎంతహృదయం వేధించుకుపోయి యిలా చేశాడో?'

"గోపాలరావుగారూ! పడుకోండి కొంచెంసేపు" అని ప్రక్క చూపించింది. అతను నెమ్మదిగా వెళ్ళి పడుకున్నాడు. సరళ అతనిముఖంవైపు తదేకదీక్షతో చూస్తోంది. మంచినీరు తెచ్చి యిచ్చింది. అతను త్రాగి సేదతీర్చుకోవటానికి పడు కొన్నాడు.

'పాపం! ఎంత చక్కగా మాట్లాడుతాడు? శ్యామల చెప్పిందికదూ యెంతో మర్యాదగా వుంటాడని. వాళ్ళఅన్న య్యతో కలిసి మాట్లాడేటప్పుడు చూచిందట. మా క్లాసు మేటయినా అల్లరిచేయడు. పెద్దమనిషిలాగ తనపని తాను చూచుకోవటం తప్ప యింకొకరిసంగతి పట్టించుకోడు. ఎంత మంచివాడైనా యేం లాభం? ఎంత చక్కని ముఖం? పాపం! ఎండిపోయింది, వాడిపోయింది. ఎన్నాళ్లైందో భోంచేసి? ఎటు వంటి భావాలు! లాభ మేమిటి? ఎవరు వింటారు, ఎవరు

చూస్తారు ? ఇటువంటివాళ్ళు యెంతమంది యిలా నశించి పోతున్నారో ?

“ అమ్మా !...సరళా ! ఎవరమ్మా ? ”

“ ఆఁ !...ఆఁ ! మాక్లాసుమేటు నాన్నగారూ ! పాపం ! ఎంత అలిసిపోయొచ్చాడో చూడండి ! ”

“ అతనిపేరు ? ఎవరమ్మా ? ”

‘గోపాలరావు నాన్నగారూ ! మనవాడే ! చాలబీద వాడు. వాళ్ళ ఆస్తిఅంతా యెవ్వరో కాజేశారట. పాపం! మొన్న ప్రిన్సిపాలు వెళ్ళగొట్టాడు నాన్నగారూ జీతంకట్టకపోతే !’

“పాపం! పడుకోనియ్యమ్మా ! లేచినతర్వాత మాట్లాడదాము. చాల మంచివాడులా కనపడుతున్నాడు.”

అంటూ వెళ్ళాడు రాఘవరావుగారు. ఆయన రిటైర్డు డిప్యూటీ కలెక్టరు. తలంతా నెరిసిపోయింది. మెత్తనిహృదయం. కఠినంగా మాట్లాడలేడు. ఎంతో చనువుగా మాట్లాడతాడు. తన సర్వీసులో యేమి నిల్వచేయలేకపోయాడు. సరళ ఒక్కతే ఆయనకు. ఆమెను ఎంతో ముద్దుగా పెంచుతున్నారు. ఆమెకూడ మృదుస్వభావ. ఎంతో చనువుగామాట్లాడి ఆదరిస్తుంది యెవరైన కష్టపడుతుంటే. ఆమెను కాలేజిలో అంతా అపోహ పడుతుంటారు చనువుగావుంటుం దని.

'గోపాలరావుకు తాను పెళ్ళిచేసుకొంటే? తన కున్న ఆస్తి చాలదూ? ఇంకా ఆస్తిపరుడు వస్తేమాత్రం యింతకంటే మంచివా డౌస్తా డని నమ్మక మేమిటి?'

ఏ మేమిటో అనుకొంటోంది.

౬

"సరళా!......సరళా!......ఇలా రామ్మా!"

"ఎందుకు నాన్నగారూ?"

"ఇదిగో యీ పత్రికలో చూడు" అని పత్రిక కాలేజికి వెళ్ళబోతున్న సరళచేతి కిచ్చాడు. ఆమె పూర్తిగ చదివి ఒక నిట్టూర్పు విడిచింది. 'ఏమి చెప్పాలి? ఏమైతేమాత్రం? నిజమే చెపుదాం. నిజంకోసం యేత్యాగమైనా చెయ్యాలి. గోపాలరావు కోసం యేమైన చేస్తాను. చెయ్యాలి. అతన్ని రక్షించాలి. అతను భర్త అయితే?...'

"అవునండి...ఇతనే ఆ గోపాలరావు. అసలు యీ కథకు పూర్వగాథ మీ కేం తెలుసు?"

"ఏమి టమ్మా అది?......గోపాలరావు యెక్కడున్నాడు!...గోపాలరావూ!"

"ఆఁ! వస్తున్నా నండి!"

గోపాలరావు వచ్చాడు చిన్నపోయిన ముఖంతో. ఎంతో అవమానం పొందినవాడిలాగ వచ్చి నిలుచున్నాడు.

"ఏమయ్యా గోపాలరావ్! యిదంతా నిజమేనా?"

"అవునండి."

"అసలు నీ విషయం యేమిటి?"

తన చరిత్రంతా చెప్పటం ప్రారంభించాడు. పూర్తిచేసిన తర్వాత రాఘవరావుగారు నిట్టూర్పువిడిచి వూరుకొన్నారు.

౭

రాజుగారు తలచుకొంటే దెబ్బలకకొదువా? ఓ! లెక్క లేనన్ని; కావలసినన్ని! వద్దనేదాకా, తృప్తిచెందేదాక వారు, దొరుకుతాయ్ దెబ్బలు. ఇంకెప్పుడూ కోరం. రాజుగారివుత్తరవు అటువంటిది. మహారాజుల కేం తక్కువ?

అలాగే ప్రభుత్వంవారు తలచుకొంటే యేం కాదు? వారిదృష్టినుంచి ఒక్క న్యాయంతప్ప యేది తప్పించుకుపోగలదు? మానవనేత్రానికి కనుపించని అణువులుకూడ ప్రభుత్వంకంటికి సులభంగా కనుపిస్తై. తప్పించుకుపోయే వస్తువంటూ లేదు. త్రిభువనాల్లో యెక్కడున్నా దుర్భిణీయంత్రముతో కనిపెడ్తారు. అటువంటిగొప్పశక్తివుంది ప్రభుత్వానికి. అటువంటప్పుడు యీనిరుపేద దౌర్భాగ్య శిరోమణైన గోపాలరావు యొకలెఖ్ఖా? జమా?

గోపాలరావును అత్తవారింటికి పంపారు పెళ్లి కాకముందే. సరళ కాలేజికి వెళుతోందన్నమాటేగాని యీమెకు మనస్తిమితం లేదు. క్లాసులో గోపాలరావునుగురించి వచ్చినప్పుడెల్ల యీమె కళ్ళెంట నీరుకార్చటంతప్ప యేంచేయగల్గుతుంది? అందరికంటె యెక్కువగా విచారించి సానుభూతిచూపించగలదు. రాత్రింబవళ్లు విచారించగలదు. వీలైతే తన సర్వస్వం ధారబోయగలదు. తండ్రిని బ్రతిమాలి గోపాలరావు విడుదలకు ప్రయత్నించగలదు. వీలులేకపోతే అతనికోసం తన జీవితాన్నికూడ త్యాగం చేయగలదు. అంతకుకూడ విధి మించిపోయినప్పుడు యెవ్వరైన మాత్ర మేమి చేయగలరు?

'ఏమైన, యెన్నికష్టాలు, నష్టాలు యెదురొచ్చినా నాతండ్రిని బ్రతిమాలి ఆయన పలుకుబడినంత వినియోగింపజేసి యేవిధంగానైనాగాని, ఆస్తి యంతా ఖర్చుపెట్టియైనా గోపాలరావును విడుదల చేయించాలి. అతనితో సుఖంగా కాలాన్ని గడపాలి. మానవజాతికి ఆదర్శస్త్రీగా నుండాలి. ఇద్దరం కలిసి నూతనవికాసానికి మానవకళ్యాణానికి పాటుపడాలి...నాకు యెందుకు యింత ప్రేమకలగాలి యితనిమీద? కాలేజిలో చదువుకొన్నంతమాత్రాన...నాతో వచ్చి మాట్లాడి తన జీవితం చెప్పినంత మాత్రాన...ప్రేమకలగాలా? ఎంతమంది పేదవాళ్లు లేరు? ఇంతకంటె నికృష్టులు లేరూ?.........ఉంటే యేం? గోపాలరావులో యేదో చెప్పరాని గొప్పతనమే తనవైపుకు లాగింది నన్ను. మానవజన్మ కేవలం జీవించటం కోసమేనా?

పరమార్థం, పురుషార్థం యేమి అక్కరలా? పుట్టాం చస్తున్నాం. అంతే! అలాయితే పుట్టట మెందుకు? అందరూ యేం చేస్తున్నారు? అందరూ చెయ్యకపోతే చేయకలిగినవాళ్ళు, తెలిసినవాళ్ళుకూడ నెందుకు చెయ్యకూడదు? వాళ్ల జీవితాలు ఎందుకు సార్థకపరుచుకోకూడదు?........ఎన్నికష్టాలు అడ్డువచ్చినా యెన్ని ఆపదలు కల్గినా గోపాల్ — నా ప్రాణప్రదాన్ని — రక్షించుకోవాలి."

ఆమె కింతకంటె వేరే ఆలోచనలులేవు. చదువుసంధ్యలు పూర్తిగ మరిచిపోయింది. అంతా పరధ్యానంగా వుంటోంది. వ్యవహారం మారిపోయింది. తనకు సాధ్యమైనంతవరకు యెన్ని విధాల వీలుందో అన్నివిధాల ప్రయత్నిస్తోంది.

వాయిదాలతోను, కేసు పరిశోధనలతోను, సాక్ష్యాలతోను, యీ వ్యవహారాలతో కొంతకాలం గడిచింది. చివరకు విచారణ ప్రారంభమైంది ముద్దాయిది.

ఆవేళ కోర్టు జనంతో కిటకిటలాడుతోంది. అంత ధైర్యంగా ఒక్కడూ కుర్రవాడు, హత్యచేశాడంటే యెంతో ఆశ్చర్యంగా చూట్టానికి వచ్చారు ప్రజలు. అతన్నిగురించి రకరకాలుగా ననుకొంటున్నారు.

గోపాలరావు యిలాచెప్పటం ప్రారంభించాడు తన స్టేటుమెంటు. ప్రజలంతా నిశ్శబ్దంగా శ్రద్ధగా వింటూన్నారు.

“నేను చెప్పేది అంత యెక్కువలేదు. ప్రతిమనిషి జన్మ మెత్తినతర్వాత నాల్గురోజులపాటు సుఖంగా కాలం గడపా లని చూస్తాడు. ఆ సుఖానికి యేదైన విఘ్నంకలిగితే ఆవిఘ్నానికి కారణమైన మనిషిమీద కక్ష తీర్చుకోవా లని వుంటుంది. అలాగే నేను యెంత దరిద్రావస్థలో వున్నానో, వుండికూడ లేకుండ వున్నానో యీ న్యాయస్థానాని కేమైన తెలుసునా? నా కెంత కష్టం, బాధ కల్గిందో మీ కేమైన తెలుసునా?...... నిజమే, నేను వెంకటరత్నాన్ని హత్యచేశాను.”

ఈమాట చెప్పేటప్పటికి సరళ నిలువునా నీరై పోయింది. నిరాశాపూరిత మైంది. నిస్పృహ చెందింది. అన్ని ఆశలు పోయినై యనుకొంది. ‘ఏమైన న్యాయం ప్రపంచంలో వుంటే గోపాలరావుకు న్యాయం కలుగుతుంది. లేదూ! నేనుకూడ నాసతీధర్మాన్ని నెరవేరుస్తాను. అవును. అబద్ధమాడకూడదు. నిజంచేత నిజాన్ని జయించాలి. అట్లా కానినాడు యేబాధనైన అనుభవించి మార్గం చూపించాలి. చూద్దాం’ అని తర్కించు కొంటోంది.

“ఆ వెంకటరత్నం యిప్పటి కిద్దర్ని హత్యచేశాడు. కాని అది యెవరైన చూచారా! మానసికంగా బాధపెట్టి చంపాడు. అది యెవరికి కనుపించింది? నన్నుకూడ చంపపోయాడు. కాని చావటానికి సిద్ధమై నా జాతినిర్మూలనానికి మూలబీజమైన యీ మానవ విషపుపురుగును నిర్మూలించి చావటానికి సిద్ధమయ్యాను. నా యీఅథఃనిపతనానికి కారణం వాడే! ఆదుర్మా

ర్గుడే! నేనే చంపింది. న్యాయస్థానం నాకు యేశిక్షవిధించినా సంతో షంతో అనుభవిస్తాను. నేను యీజన్మలో చేయవలసింది పూర్తయింది. నాకేమి విచారం లేదు. ఈన్యాయస్థానాలన్నీ న్యాయంకోసం........................ఇంక శిక్ష చెప్పవచ్చు.”

## ౮

“సత్యాని కెక్కడా తావులేదూ? నాగోపాల్ చేసింది తప్పా? అతనలా కృశించి కృశించి నామరూపాలు లేకుండ పోతే అప్పుడు న్యాయమా? సత్యమా? అభాగ్యుడు ఒకడు బ్రతకటానికి యెక్కడా అవకాశం లేదూ? ఆహా! ఏం న్యాయం? ఏం పరిపాలన? ఇద్దరు వ్యక్తుల్ని అన్యాయంగా ధనదేవతకు బలి వేసిన మహనీయుడు నిర్దోషా? కడుపులో కాలి తనయాస్తి దొంగిలించిన దొంగను, సంఘద్రోహిని రూపుమాపిన సంస్కర్త, గౌరవనీయుడు, విద్యావంతుడు, ఐన గోపాలరావు దోషా? దొంగతనంచేస్తే ప్రభుత్వంవారు శిక్షించటంలా? అసభ్యతాప్రవర్తకుల్ని శిక్షించటంలా? అదే ఒకవ్యక్తిచేస్తే క్షమింపరాని నేరమా?......నేను గోపాలరావును పెళ్ళిచేసుకో లేనూ? అతనిజీవితం వృథాయేనా?......నాజీవితమో?... వృథా! నా గోపాల్‌కు వురి!......అమ్మో వురి!......... వురి!”

సరళకు నిద్రలేదు. మనస్సు మనస్సులో లేదు. ఏంచేయ టానికి తోచుట లేదు. ఎంతో ప్రయత్నించింది. తండ్రిచేత చేయించింది. నేరస్థుడు నేరాన్ని ఒప్పుకొన్నప్పుడు శిక్షతప్పదు. డబ్బుకూడ వృథా. చెయ్యగల్గిందంతా చేసింది. అంతా విఫల మైంది. అప్పీలుకూడ వృథాయైంది. విధిని మారటంతప్ప యిం కేం చేయగల్గుతుంది? ఆమె యెంతబాధపడుతోందో వర్ణించ టం కష్టం.

ఆవేళ చివరిరోజు గోపాలరావుకు.

సరళ జైలుగేటువద్ద నిలబడింది. కళ్ళెంటనీరు నదిలాగ ప్రవహిస్తున్నై. నోటివెంట మాటరావటంలేదు. అలాగే గోపాలరావును చూస్తూ నిలబడి వుంది. గోపాలరావుకు కూడ పట్టరానిదుఃఖం వచ్చింది. తననుగురించి విచారించి సానుభూతి చూపే వ్యక్తి ఒకటివుందని సంతోషించాడు. 'తననుగురించి యీమె అంతగా విచారించటం దేనికి? తనవల్ల నామె కేమి లాభం! ఎందుకంత సానుభూతి?...పిచ్చిపిల్ల!...కాదు... మంచిపిల్లే! మంచివాళ్ళకు తావులేదు. వాళ్ళనే పిచ్చివాళ్ళం టుంది ప్రపంచం. వాళ్ల కృత్రిమాలోచనలు నిర్విఘ్నంగా కొన సాగేటందుకు అడ్డురాకుండ చేయటానికలా పిలుస్తుంది.'

"సరళా!......ఎందు......"

"..........."

"ఎందుకు సరళా యేడు......"

"గోపాల్ !......"

"నన్ను చూచి దుఃఖపడేవ్యక్తివి నీ వొక్కదానివి మాత్రం కనుపిస్తున్నావు. ఎందు కంతజాలి నన్నుచూస్తే ?"

"గోపాల్......"

"............"

"ఎందుకా ?...నే నేం చెప్పను ? నాకు సమాధానం తెలియదు. కాని... కాని...కాని...నిన్ను..."

"ఏం సరళా ? ఆఁ ! ఏం ?"

"ఏమిలేదు కాని...మిమ్మ......"

"అంటే ?"

"ప్రేమించాను. ఇంక నాకు భయమెందుకు? చెప్తున్నాను వినండి. ఎంతో ప్రేమించాను. ఊహాసౌధాలు నిర్మించాను. కొంతవరకు భావానందం అనుభవించాను. మిమ్మల్ని శిక్షనుండి తప్పించాలని నా శక్తికొలది ప్రయత్నించాను......కాని...లాభం లేకపోయింది......"

"ఆఁ !"

"అవును."

"పిచ్చిదానా ! నాకే తావు లేనప్పుడు నీవు నన్నుపొంది యేంసుఖ మనుభవిద్దా మని?"

"..............."

"నీజీవితాన్ని వృథాచేసుకోక! వివాహంచేసుకో! సుఖపడు! నాజన్మ సార్థకమైంది. నేను చెయ్యవలసినకార్యం పూర్తయింది. ఒకరిచేత ప్రేమింపబడ్డాను. నాబోటివాళ్ళనేక మంది వున్నారు. వాళ్ల శ్రేయంకోసం పాటుపడు. అన్యాయంగా నీజీవితం వృథాచేసుకోక సరళా! సుఖపడు! నలుగురికి వుపకారం చెయ్యి! నీజన్మ సార్థకంచేసుకో!"

"లేదు. ఇవన్నీ యిదివరకే తర్కించాను. నాకేమి సమాధానం దొరకలేదు. నేనుకూడ మీతోపాటు వస్తాను. ఇప్పుడు కాకపోయినా యింకా నాలుగు రోజులకైనా."

"వద్దు సరళా! వద్దు! నా మాట విను. నామీద నీకు ప్రేమవుంటే నామాట లక్ష్యపెట్టు. విను. ఆచరించు. పోనీ, బ్రహ్మచారిణిగానే వుండి నాబోటి అభాగ్యులకోసం దేశ దారిద్ర్య నిర్మూలనానికి తోడ్పడు. అప్పుడు నాకు ఆత్మశాంతి కల్గుతుంది. సరళా! మన జన్మలు ధన్యం! అబ్బా! ఏ మానందం! నాకు విచారం లేదు! సరళా! వెళ్ళమ్మా! వెళ్ళు!

"ఆఁ! వెళ్ళనా?"

"........." కన్నీరు ఆమెచేతిమీద పడింది.

"చిత్తం! మీ ఆజ్ఞ నెరవేరుస్తాను. నా జన్మ బ్రహ్మచర్యంతోనే గడుపుతాను. నాజీవితం మీయాజ్ఞ, సందేశంకోసం త్యాగం చేస్తాను.....నా జన్మ ధన్యంచేసుకొంటాను...... శెలవు.

"మంచిది! శుభమస్తు!"

ఆమె బరువైన అడుగులు నిట్టూర్పులతో కదలిస్తూ వెళ్లింది. సూర్యుడు వెళ్ళలేక వెళ్ళలేక పడమటి దేశానికి వెళ్లాడు.

మూడో రోజు పత్రికలో 'సరళా, గోపాల్ విషాదగాథ' గోపాలరావు ఫొటోతో కూడ ప్రకటితమైంది.

సరళ వీరపూజ ప్రారంభించింది, తన ప్రతిజ్ఞాపాలనకోసం.



వినీలవినిర్మలాకాశంలో నక్షత్రమండలం మధ్య చందమామ దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు. అక్కడక్కడ తెల్లని తెలిమబ్బులు చిత్రకారుని చిత్తుబొమ్మల్లాగ ఆకాశఫలకం మీద చిత్రింపబడి తుడిచివేయబడుతున్నాయ్. చందమామ అల్లుళ్ళను అదమాయిస్తూ వాళ్ళ కందకుండా తప్పించుకొని పడమటి దేశానికి పరుగెత్తుకొంటూ పోతున్నాడు.

భూదేవి శరీరమంతా పెద్ద బొబ్బ లెక్క, చితికి కారే నీరులాగా ప్రవహిస్తూ ఘోష పెడ్తున్నై నదులు. విశాలమై పినాయకుని బొజ్జలాగ పెరిగిన తన గర్భంలో, సాగరుడు, పోసుకొంటున్నా డా నీరంతాను. ఆ నీళ్ళు త్రాగిత్రాగి కడుపుపట్టక ఆయాసం యెక్కువై రొప్పుతూ మహాఘోష పెడ్తున్నాడు. భూదేవి కట్టుకొన్న ఆకుపచ్చని జరీచీరె తళతళ మెరుస్తోంది.

ప్రకృతి ప్రేమసామ్రాజ్యాభిషిక్తులకు, పూలపాన్పుల మీద పొర్లాడుతున్న రాండోలు పొట్టలగాళ్ళకు హాయినిస్తోంది. కాని నిరుపేద హాలిక, పాటక జనులకు, నిరంతర దుర్భర దారిద్ర్య దేవతాప్రియపుత్రులకు మాత్రం ఒకప్రక్క కడుపులో జ్వాల దహించుకుపోతోంది. మహాసామ్రాజ్యాభిషిక్తులై దురంత దురాశాపీడితులైన మహారాజులను ఆశాదేవత యావరించి అలమటింప జేస్తోంది.

చిరకాలంనుంచి కట్టుకొన్న ప్రేమసౌధాలు కూలిపోవ టంవల్ల పునర్నిర్మాణ కార్యక్రమాన్ని ఆలోచిస్తున్న యువతీ యువకుల భావవీధుల్లో భవనాలు లేస్తున్నాయ్ పశ్చాత్తప్త దహించుకుపోయే హృదయాల్లో నలనలుకొంటున్నారు బంధితులు. పక్షిజాలంమాత్రం హాయిగా, నిశ్చింతగా నిద్ర పోతున్నాయ్—గబ్బిలాలు, గుడ్లగూబలు తప్ప. అవి, సామ్రా జ్యాలను అమాంతంగా మ్రింగే రాబందుల్లాగ సామాన్య పక్షి కుటుంబాలను కబళిస్తున్నై. ఆ పక్షులు చేసే ఆందోళన కీచు రాళ్ల కీచుధ్వనితో కలిసి ప్రకృతిప్రశాంతతను భగ్నంచేస్తోంది. వాటికి శిక్షలేదు—కాని మానవుడే ఆపని చేస్తే? — ఉరికంబమే ఆశ్రియం......లోకం!

శాంత—కర్మ అనే పేరుతో నాశనంచేయబడ్డ కష్టజీవి— జీవితాంతం వరకూ వృథాగా వెట్టిచాకిరిచేస్తూ అందరిదృష్టికి నసహ్యాకరంగా కనుపిస్తూ అపారమైన యీ యనంత విశాల ప్రపంచ దుఃఖసాగరంలో దరిగానక కొట్టుకొస్తున్న దౌర్భాగ్య జీవి — అశుభకార్యాలకు తప్ప శుభకార్యాలకు పనికిరాని అభాగ్యజీవి—తనజన్మ హక్కైన పసుపుకుంకుమను పుస్తెకట్టిన వాడు లేడని, తనవుపయోగం కోసం సంఘం వాటిని హరిస్తుంటే చూస్తూ వూరుకొన్న యసమర్థురాలు—సంఘసవతిచెప్పే ఓదా ర్పులకు వుప్పొంగిపోయే తెలివితక్కువ పెద్దమ్మ.

ప్రస్తుతం తండ్రియింట్లోనే వుంటూ తల్లిలేనితనజీవితాన్ని మిగిలిన తన బంధువర్గానికి అంకితం—కాదు—అర్పణజేసిన

యనాథ. కూలికివచ్చే కూలి ఇష్టముప్రకారం పనిచేసి కూలి పుచ్చుకుపోతాడు—కాని యీ కూలికి అంతు పంతు లేదు. ఆజ్ఞ లేక యెన్నిపనులు చేయాలి. కాలచక్రాన్ని యెంతో కష్టంతో రెండు చేతుల్తోను పట్టుకొని దొర్లిస్తోంది. ఇంక నామెకు శక్తి తగ్గిపోతోంది. చక్రం బరువెక్కువై పోతోంది. భరించలేక పోతోంది బాధ. చక్రాన్ని వదలితే క్రిందపడి పగిలిపోతుందేమో. నని భయం. ఇంతవరకు యేదో చెప్పరాని ఆశ ఆమెకు తెలియకుండ భరింపజేసింది. ఆశలవల్ల కార్యాలు ఫలించవు. కార్యరంగంలో కురికి అవకాశాన్ని ఆధారంచేసుకొని కృషిచేసినప్పుడు మాత్రం ఆశలు సఫలత నొందుతాయ్. ఆమె యదే యాలోచిస్తున్నది సుదీర్ఘంగా.

ఇల్లంతా చక్కబెట్టుకొని గదిలో కూర్చొని టేబిల్ మీద తలనాన్చి చేతిలో నున్న 'ప్రేమసామ్రాజ్యం' పుస్తకాన్ని తడిపేస్తూ ప్రవాహాన్ని వదుల్తోంది, యీమెకు తెలియకుండానే. తడి శరీరాని కంటి స్పృహ వచ్చేవరకూ అలానే నిస్పృహలో వుంది. స్పృహరాగానే పుస్తకాన్ని తన పైటతో నద్ది గూర బెట్టింది. పుట లొక్కొక్కటే త్రిప్పుతోంటే ఆత్మలో నగ్ని రగుల్కొంది. ఇది ప్రళయాగ్ని. దాన్ని చల్లార్పటానికి యెవరికీ తరం కాదు. చల్లార్పలేరు. అడ్డువచ్చిన వాళ్ళంతా దహించుకు పోవటం తప్ప ఫలితం యేమి వుండదు. తండ్రి బయటకు వచ్చి గదిలో వెలుతురు కనుపిస్తే యేమిటో నని కిటికీలోనుంచే తొంగి చూచాడు.

"అదేం పుస్తక మమ్మా?.........ఇంకా మేలో న్నావేం తల్లీ?"

చెప్పలేక మూసింది పుస్తకం. అట్టమీదవున్న పేరు కనుపించింది. విప్లవం బయలుదేరింది తండ్రి హృదయంలో. దాన్ని అణుచుకోలేక—

"ప్రేమసామ్రాజ్యమా?...... ఆఁ!...... పడుకో అమ్మా! పడుకో ప్రొద్దుపోయింది. మళ్ళీ నాలుగ్గంటలకే లేవాలిగా!"

మౌనమే సమాధానం. లైటు తీసేసింది. చాప వేసుకు పడుకొంది తాత్కాలికంగా.

'ఇంత చాకిరీ చేస్తున్నా యీ నిర్దయులకు దయలేదు. అవును అది సహజమే. నిర్దయులకు దయ యెలా వుంటుంది? దయవుంటే నిర్దయ నామధేయులు కారుగా! కడుపార కన్న తండ్రికి కూడ తనమీద ప్రేమ లేదే? తాను తండ్రికి యే విధంగాను ఉపయోగపడదు. కర్మకాండలు జరిపేది కాదు. సంపాదించే శక్తి కలది గాదు. తాను యెందుకు వుపయోగపడ్తుంది? విద్యావంతురాలైనప్పటికి వాళ్ళు యేమాత్రం గౌరవ మర్యాదలు లేకుండా పశువుకంటే హీనంగా చూస్తున్నారు. ఇంత అస్వాతంత్ర్యపు బ్రతుకు తన కెందుకు?.........ఎన్నిసార్లో ప్రయత్నించింది రామును కలుసుకోవాలనీ, తన దుర్భర యాతన నంత చెప్పుకోవాలని. కాని యాతనిదర్శన మెప్పుడూ దొరకలేదు.

'తన కళాశాలజీవితం యెంతహాయిగా, ఆనందంగా గడిచింది? తన మిత్రులతో యెంత సంతోషంగా కాలం గడిపింది? ఇంటరుక్లాసు ఫస్టుక్లాసులో ప్యాసయినప్పుడు మిత్రులు, ప్రిన్సిపాలు, లెక్చరర్లు యెంతసంతోషాన్ని వెలిబుచ్చి తనను గౌరవించారు? అందరికంటె రాము యెంతో మర్యాద చేశాడు. రాము తన నెంతో......ఆప్యాయంగా చూచేవాడు. కాని అతని ప్రకృతి వేరు. ఎవ్వరితోను అంత చనువుగా మాట్లాడడు. సానుభూతి చూపించడు. క్లాసులో అల్లరిచేస్తే తన్ను యెంతో గొప్పగా మెచ్చుకొనేవాడు. ఆ మిత్రులు, ఆ సంతోషపుదినాలు, అన్నీ యే మైనయ్?......రామును చూచి యెన్నాళ్లైంది?

'ఇంక నీయింటిలో నుండటం సాధ్యంకాదు. రాము యెక్కడా కనుపించడూ?......నా యెడమ కన్ను దరుతోం దెందుకో? ఇదికూడ శుభసూచకమే!'

ఆమెకు యీ ప్రపంచంలో రాము ఒక్కడే కనబడు తున్నాడు. అత నంటే యామె కంత అభిమానమూ, ప్రేమ యెందుకో? అతన్నిగురించి శాంత చెప్పేదంతా అత నొక గొప్ప చిత్రవ్యక్తియని, మాత్రమే!

ఆమె తండ్రి యీమెహృదయంలో నుండుతున్న జ్వాలకు నెయ్యిపోసి యింటిలోనికి పోయి పడుకొన్నాడు. భగ్గుమంది మంట. గప్పున పైకి లేచింది మంట.

ఆమె మెల్లగా లేచి పెట్టె తెరిచింది. బరువైన పర్సు తీసుకొని చప్పుడులేకుండ యిల్లు దాటింది......నిద్రితసాక్షి ప్రపంచకానికి నామె యేమైతే నేం? ఎక్కడికి పోతే నేం? ఎవరికాకావాలి?

చందమామ యామెను చూచి దాక్కొన్నాడు సిగ్గుచేత నామె సౌందర్యానికి తాను సాటిగాదని కాబోలు! ఆమె భగభగమండే భావాల్తో దడదడలాడే గుండెల్తో అడుగులో నడుగులు వేసుకొంటూ పోతోంది అగమ్యగోచరంగా. చెట్లమధ్య నీడల్లో వెనక్కు తిరిగి చూచుకొంటూ భయంతో చెదిరే గుండెను గట్టిగా పట్టుకొని బరువైన యడుగులు వేసుకొంటూ వెళ్తోంది. మధ్య మధ్య చెట్లపొదల్లోనుంచి వచ్చే ధ్వని కీచురాళ్ళధ్వనితో కలిసి వినిపించి ఆమెకు భయాన్ని కలుగజేస్తోంది.

ప్రశాంతతను భగ్నంచేస్తూ హోరుపెట్టుకొంటూవచ్చే నదీకెరటాలధ్వని యెక్కువై సమీపిస్తోంది. పర్వతగహ్వరాల్లో నుంచి వచ్చే గోంద్రుమనే ధ్వనికి లేడిపిల్లవలె భయపడి బెదిరిపోయి చుట్టూ పరికించి చూచుకొని మళ్ళీ గుండె కుదుటపర్చుకొని, సంఘరాక్షసిచేసే గర్జనకంటె, పెట్టే హింసకంటె యీ వనమృగాలు, నక్కకూతలు, గుడ్లగూబల అరుపులు యెక్కువ బాధ కలుగ జేయవనే ధైర్యంతో సాగిపోతోంది.

నదీతీరానికి పోయేదారిలో ఆ నదీకెరటాల హోరుతో కలిసి "ఓ నిర్భాగ్యపుజీవీ! కష్టాలు కలకాలం వుండవు. ధైర్యం పూను. సంఘాన్నెదిరించు! ధైర్యాన్ని చూపించు!!

నీ బానిస శృంఖలాల్ని తెగగొట్టు. స్వాతంత్ర్య జీవనమే జీవిత పరమావధి. స్వార్థ ప్రపంచానికి వెరువక! నీవుకూడ సుఖాన్ని పంచుకో! ధైర్యమే నీ కాయుధం" అనే ప్రబోధం వినిపించిందామె చెవులకు.

ఆ తీరానవున్న బుద్ధమూర్తి ఆలయంముందాగింది. బుద్ధమూర్తిని దర్శించి యీ మహానీయుని యాజ్ఞ తీసుకొందామని వచ్చింది. కాని ఆలయపు తలుపులు మూసివున్నయ్. ఆమె యీ దివ్యమూర్తి దర్శనానికి నోచుకోలేను కాబోలు నని విచారపడింది. హృదయంలో ప్రత్యక్షమై మనోనేత్రాలకు గోచరించాడు లీలగా. ఆ విధంగా యీ స్వామిని తిలకిస్తూ పరవశత్వం చెందుతోంది.

అతడు ప్రపంచంకోసం స్వసుఖాన్ని విడిచి త్యాగమూర్తి యయ్యాడు. తానో? — స్వసుఖంకోసం ప్రపంచాన్ని విడుస్తోంది. తేడా యేమిటి?

ఆ మూర్తి సాధించి యిచ్చిన దివ్యజ్ఞాన జ్యోతిని చేత్తో పుచ్చుకొని జీవితపరమావధికోసం బయలుదేరింది. అంతే!

ఆమెకు మళ్లీ స్వాతంత్ర్య ప్రబోధం వినిపించింది. దాన్తో తెలివి వచ్చింది.

నదీకెరటాలను పర్వతాలమధ్యనుంచి పచ్చని ప్రకృతి మధ్య చందమామప్రతిబింబం నదిలో చూస్తుంటే హృదయంలోని భారాన్ని చల్లనిగాలి లేపేస్తోంది. హృదయం తేలికవు

తోంటే ప్రపంచకాన్ని మరిచిపోయి మనోహరగానంతో తన్మయత్వం చెందుతూ పాడుతోంది.

విచిత్రపుమానిసి యీమె. అంతలో విచారపడుతుంది. మళ్ళీ యంతలో సంతోషడోలికల్లో వూగుతుంది. నిష్కల్మష హృదయం. ఆమెహృదయంలో దురాలోచనలకు తావులేదు. కనుకనే అన్ని కష్టాలనుభవించవలసి వచ్చింది. ప్రపంచం తనకు విరోధులనుకునే కుట్రదారులను మంచితెలివిగలవాళ్ళనీ, మేధావులనీ, గొప్పవాళ్ళనీ బిరుదులు తగిలించి మచ్చికచేసుకొంటుంది జోలపాడుతూ. సత్ప్రవర్తకులను, సన్మార్గులను, తన వుపయోగానికి పనికిరానివాళ్ళను అమాయకులనీ, పిచ్చివాళ్లనీ, తెలివితక్కువవాళ్ళనీ నిందలుమోపి తనవలలో వేసుకోవటానికి చూస్తుంది. తనకు యేవిధంగాను లొంగని మూడవరకపు మనుష్యులను గర్వపోతులనీ, దొంగలనీ, నీచులనీ, ద్రోహులనీ తిట్టి బహిష్కరింపజూస్తుంది. ప్రతిమానిసి యీ మూడుతరగతులలో యేదియో నొకదానిలో చిక్కుకొనవలసినవాడే!

౨

కొన్నికొన్ని విషయాలు చాల విచిత్రంగా జరుగుంటై. తలవని తలంపుగా కొన్నివిషయాలు అనేక భిన్నరూపాలుగా జరుగుతై. అనుకొంటున్న విషయమే అనుకూలంగా యప్పుడే కళ్ళముందు జరుగుతుంది. నిరాశజెందిన విషయాలు కొన్ని

అకస్మాత్తుగా అనుకోకుండా సఫలం జెందుతాయ్. ఇలాగే చాలవిషయాలు. దీనికి కారణం యేమిటో తెలియదు. కర్మ అని, అదృష్ట మని తృప్తిపడవలసినదే నని యాస్తికవాదు లంటారు. కాని ప్రపంచంలో మనిషి పుట్టటానికి యేమికారణమో, పెరగటానికి యేమికారణమో అటువంటి విషయాలు జరగటానికి అదే కారణం. మనిసి మానసికతత్వాన్ని బట్టి వుంటుంది. తెలియని కారణ మేదియు కాదు.

రాము విద్యాధికుడు. అస్ఖలిత బ్రహ్మచారి. మాతృదేశ దాస్యశృంఖలాల విచ్ఛేదనకు పూనుకొన్న వీరుడు. తన జీవితాన్ని నాలుగోడలకోట్లకు అర్పించిన త్యాగి. రాండోలు పాట్లలు పెంచుకొని కుక్కలై, బానిసలై, సోమరిపోతులై దాస్యభావాలతో బానిసజీవితం గడిపటానికే వుబలాటపడే దౌర్భాగ్యులదృష్టికి వెగటుగా కన్పిస్తున్న చిత్రవ్యక్తి. తన ప్రవర్తన బాగుగాలేదని తన తోటివారితోను, ప్రభుత్వంతోను విమర్శింపబడి తలదాచుకొనుచున్న ప్రభుత్వవైరి. ఈప్రపంచంలో యెంతమంది దృష్టికి వెగటుగా కనుపడి దూషింపబడుతున్నప్పటికి అంతమంది యతనిని భూషించి గౌరవిస్తున్నారు.

తండ్రి ధనికుడు. ఊళ్ళో పలుకుబడిగల పెత్తనదారు. బానిస జీవితానికి అలవాటుపడిన బానిస. విద్యాగంధం యెక్కువగా లేని పామరుడు. పూర్వాచారపరాయణుడు.

విద్యాదేవతకు, ధనరాక్షసికి యుద్ధం బయలుదేరిం దా యింట్లో. చాలకాలంనుంచి యటు దేశరక్షకులబాధలు, యింట్లో

తండ్రిపెట్టే మానసిక వ్యధలు సహించాడు. మానవహృదయం యేదో ఒక బాధ యెంతగొప్పదైన భరించగలదు. కాని ఒకే సారి ననేక కష్టాలు భరించలేదు. ఒకే ఒరలో రెండు కత్తులు యిమడనట్లుగానే ఒకహృదయం బాధ లనేకం సహించలేదు. రాముకు ఓర్పు శక్తి తగ్గిపోతోంది. తగ్గిందికూడ. బాధ సహించ లేనప్పుడు విప్లవమే కాని ఫలితం. బాధయొక్క అంతిమ పరిణామమే విప్లవము.

అదే రాత్రి అతనికీ, తండ్రికీ :

" రామూ "

"......... "

" ఇంతకాలం యెలాగో వూరుకొన్నాను. చదువుకోస మని కొన్నాళ్ళు తప్పించుకొన్నావు. తర్వాత వుద్యోగం పాడు లేకుండ యీ విధంగా జైల్లోపడి మ్రగ్గుతున్నావు. ఇకనుం చైనా నీ కార్యక్రమానికి స్వస్తి చెప్పు."

ఆ చివరిమాటతో తలెప్పైకెత్తి చూశాడు. హృదయా నికిచిచ్చు అంటించినట్లైంది. ఎంతవుద్రేకాన్నైనా అణుచుకోవాలి సమయాన్నిబట్టి.

" ఆఁ !......"

" కాని......యిక వూరుకోవటానికి వీలులేదు. నీకా వయస్సు ముదిరిపోతోంది. ఇంక నీకు పిల్ల నెవరిస్తారోయ్?...... నీకోసం తక్కినవాళ్ళను యెంతకాలం ఆపను?"

"........." చదివేపుస్తకం మూసి తండ్రివంక తీక్ష్ణంగా చూస్తున్నాడు. ఈ నిస్సహాయుని దృక్కులు ఆ ధనిక చక్రవర్తిని యేమిచేయుగలవ్ ? నీటిలో రాయివేసినట్లే!

" నీ వుద్దేశ్యం మార్చుకోవాలి. లేకపోతే చాలకష్టం వస్తుంది. ఊళ్ళో తలెత్తి తిరగలేకుండవున్నా! "

"..............."

"ఏదో ఒకటి ఆలోచించిచెప్పు. సంబంధాలు చాల వస్తున్నాయ్. వాళ్ళకు సమాధానం చెప్పాలికదూ?"

"మీ కిదివరకే చెప్పాను కదూ?"

"ఏమని ?" ముఖంచిట్లించి వెగటుగా చూస్తున్నాడు.

"వాళ్ళకు చేసెయ్యండి......నేను......"

"పెద్దవాణ్ణి నిన్నలా పెట్టి వాళ్ళకుచేస్తే నవ్వుతారు."

" ఎవరిపెళ్లాన్ని వాడు చేసుకొనేటప్పుడుకూడ పెద్ద చిన్న యెందుకు? ఇప్పు డేమి రామాయణకాలం భారతకాలం కాదుగా! దేవర న్యాయాలు లేవుగా !"

" ఏమిటీ ?"

" ఏమిలేదు. మీకు తెలియనప్పుడు యింతకంటె యెక్కువ అనవసరం. వాళ్ళకు చేసేసెయ్యండి వివాహాలు."

" వల్లకాదు. అలా వీలు లేదు. "

కోపోద్దీపితమైన యేదో క్రూరనిశ్చితమైన వుద్దేశ్యం స్ఫుటంగా ముఖంలో గోచరిస్తోంది.

"అయితే నే నేంచెయ్యలేను. మీ యిష్టం. నే నమ్ముడు పోను, బానిసను గాను."

"ఆఁ !......అంతడబ్బు వృథాగా పోవాల్సిందే?... ఒకటా రెండా? ఇరవై వేలు!"

"ఇరవై వేలుగాదు, ఇరవై లక్షలైనా నేను అమ్ముడు పోను...మీ రిదివరకే అన్నారుకదూ? ఆ యమ్మాయిని చేసుకోకపోతే ఆస్తి నివ్వనని...ఇంకా యెందుకు నాతో శ్రమ?"

క్రోధాగ్ని విజృంభించింది. పట్టలేకపోయాడు.

"ఓరి నీచముండా నిన్నా తగలెయ్య! ఎందుకురా యం. ఏ.? తండ్రిమాట వినక యేమైపోతావ్?" తాను యెంత ధనికుడైనా విద్యాగంధంలేని పామరుడు, విద్యాధికుని పట్టుకొని యేమాత్రం సంకోచంలేకుండ తండ్రి ననే అధికారంతో దూషించాడు. అభిమానం బంధుత్వవిచారంగాని, తల్లితండ్రి విచారంగాని వుండనీయదు.

"మీ రెప్పుడో అన్నారు మీకూ నాకూ సంబంధం లేదని. ఈ విషయంలోమాత్రం మీకూ నాకూ......"

నిశ్చలమైన దృఢాభిప్రాయం, ధైర్యచిహ్నాలు, స్వాతంత్ర్యేచ్ఛ స్ఫుటంగా గోచరిస్తున్నాయ్. అచంచలదృక్కులతో సమాధాన మిచ్చాడు.

"అంతేనా?"

"పెళ్ళిచేసుకొనేది నేనుగాని మీరు కాదుగా?...... మీరు డబ్బువిషయం ఒక్కటే ఆలోచిస్తే తక్కిన విషయాలేమి అక్కరలేదా?"

"అయితే?"

"అయితే — నేను......చేసుకో నంటాను."

"వెధవముండను చేసుకొంటావా! మాదిగముండను చేసుకొంటావా?"

"ఎవరైనా మీకు సంబంధం లేనప్పుడు?"

"సంబంధంలేనప్పుడు నాయింట్లో మాత్రం?"

"ఊం! సరే!"

తండ్రి యెఱ్ఱపడిన ముఖంతో యింట్లోకి వెళ్ళాడు. బీరువాలోనుంచి యేమిటో తీసుకొని బయలుదేరాడు చెప్పులు తొడుక్కొని. చొక్కా బొత్తాలు సరిచేసుకొంటూ పాల ప్రవాహంలాగవున్న ఆ బాటవెంట నడిచి వెళ్తున్నాడు.

రాము వెళ్ళగానే గడియారం సానుభూతి చూపిస్తూ ఒంటిగంట కొట్టింది. చందమామ ఆహ్వానిద్దామని తొందర తొందరగా దిగి వస్తున్నాడు, పడమటి కొండలమీదుగా. ప్రకృతంతా ప్రశాంతంగా వుంది నదీఘోష తప్ప.

నదీతీరాన్నుంచి చల్లని గాలితో కలిసి అతి శ్రావ్యంగా వినవస్తోంది మధురగానం. మిత్రు నింటికి బయలుదేరిన అతని కాళ్ళు నదీతీరానికి లాగినై ఆ యర్థరాత్రివేళ. తీరాన్ని సమీపిస్తున్నకొద్దీ గానం అతిశ్రావ్యంగా వినిపిస్తోంది. ఆ గానం తప్ప నదిఘోషగాని, జంతువుల అరుపులుగాని వినిపించటం లేదతనికి. తీరాన్ని సమీపించాడు. మనోహరమూర్తి గానంలో తన్మయుడై నిలబడ్డాడు యామెకు సమీపంలో......

ఆమె గానా న్నాపింది. నదీఘోషను తిలకిస్తోంది. వెనుక కదలిక వినబడితే వెనక్కు తిరిగింది.

"ఆఁ !"

ఆమె నిలువునా నీరైపోయింది. కెరటాల హోరుకంటె హృదయంలో అలజడిహోరు యెక్కువైంది. అతడు మాట్లాడ లేకపోతున్నాడు. దూరంగా వెళ్ళి తలవంచుకొని,

"ఎవరు మీరు ?" అని ప్రశ్నించింది.

"...........:"

"..........."

"నేను......నేనా!......నే......నూ......"

"మీ...రే !"

"నాపేరు......రా......ము......అంటారు."

'రామా ? ఏరాము ? తనమిత్రుడు, తనసహపాఠి తన ఆరాధ్యవ్యక్తి, తన ప్రేమైకమూర్తి రాము ! రాము, యం. ఎ. ఇతనే ? అబ్బ ! ఎన్నాళ్ళైందిచూచి ! అయిదేళ్ళు ! ఒక్కసారిచూస్తే ? ఏమనుకొంటాడో ? నేను గుర్తున్నానా ? ఏమో ? ఆఁ ! తప్పకుండ గుర్తుండి వుంటాను. నన్ను మర్చి పోయాడా ?......అయినా యిప్పు డేమని పలుకరించాలి ? అసలు అతనేనా ? ఇప్పుడు యిక్కడి కెందు కొచ్చాడు ? తన కోసమే నేమో ? అమ్మో ! ఇం కేమైన వుందా ? తండ్రి బ్రతక నిస్తాడా ? తాను బ్రతక గలదా ? ఎందు కొచ్చాడో రాము ? తన రామేనా?...అవును. యెవరైనా భయమెందుకు? అందరికి వలె తనకుకూడ సుఖాన్ని అనుభవించే శక్తి, హక్కు వుంది. ఎవరికైనా యెందుకు జడవాలి ? అది కాపురుషలక్షణం. నారాము అయితే యేం ఫర్వాలేదు. ఇంకొకరైతే కొంచెం కష్టం. చూద్దాం.'

"రామా ?......ఏ రాము? "

"మీరా...రెవరూ ?"

"............"

"మీపేరు తెలిసికో వచ్చా ?"

"శాంత".

"ఆఁ !......శాంత ?"

"రాము యం. ఎ. కదూ ?".

ఆమెకు దృఢపడింది తన రాముడే నని. ధైర్యంతో సంతోషం తెచ్చుకొని అడిగింది ఆత్రుతతో. ఆనందాన్ని అణుచుకొంటూ అతనిముఖంవంక చూస్తోంది.

"ఊఁ! ఆ దౌర్భాగ్యుణ్ణి నేనే? మీ రెరుగుదురా?"

పెద్ద నిట్టూర్పు విడిచి తగ్గుస్థాయిలో,

"రామూ!" అని అతనిముఖంవైపు చూస్తోంది తీక్షణంగా. పూర్వపు రాముకు యీ రాముకు భేదం వెదుకుతోంది. పోల్చి చూచుకొంటోంది.

అతడుకూడ తలపైకెత్తి ఆమెను తీక్షణంగా చల్లని చూపులతో తిలకిస్తున్నాడు. పూర్వపు శాంతను గుర్తుతెచ్చుకొంటున్నాడు. తన మనఃఫలకంమీద చెరిగిపోకపోయినప్పటికి ఆమెను తిరిగి అక్కడే చూస్తున్నాడు.

"నన్నప్పుడే మరిచిపోయావా? ......నీ సహపాఠిని, స్నేహితురాలిని మర్చిపోయావా?"

ఆశాపూరితంగా వున్నై ఆమె దృక్కులు. అతన్నుంచి ఏదో గొప్ప బహుమతిని పొందుతానన్న ఆశతో చూస్తోంది.

"శాంతా! ......ఆ శాంతవేనా? .........చాల తేడావుందే? .......''

ఆమె యతని ముఖంవైపు చూస్తూనే,

"రామూ! ......నిజమే......కాని......"

"ఈ అర్ధరాత్రివేళ యిక్కడికెందుకొచ్చావు శాంతా?"

"రామూ!"

"............"

"నీవు ఒక అభయం యివ్వాలి. నాకు చాల ధైర్యం చిక్కితేనేకాని నా నిర్భాగ్యపు జీవితం చెప్పను."

'నేను అభయ మివ్వటమా? నే నేమిటి? యీామె కేమిటి? అసలు యిలా వుందే? ఈమె భర్త పోయాడు కదూ పాపం! ఎంతమార్పు? ఇదివర కెంత చనువుగా వుండేది. విప్లవకారి అవుతుం దేమో ననుకొన్నాను యిదివరకు. ఇప్పు డిలా అయిపోయిం దేం పాపం? ఇప్పు డెందు కిలా వచ్చింది? ఆ సంగీతం యీామె పాడిందా? ఎంత తెలివిగలది? అయినా ఒక్కొక్క కాలం అలా చేస్తుంది మానవ జీవితాల్ని. ఆమె యెంత ఆపదలో వుండి అడుగుతోందో? ఇంతకంటె నేను చేయవలసిం దేముంది?'

"శాంతా! నీవు నిజంగా గానమోహినివి."

"రామూ! పొగడ్త తరువాత. ముందు నాచరిత్ర విను. నాకు అభయహస్త మివ్వాలి."

"ఊఁ! నాచేతనైనంతవరకు."

"కాదు. పూర్తిగ యివ్వాలి."

"ఊఁ! సరే యేమిటో చెప్పు!"

"రామూ! నీకంటె నాకు సహాయంచేయగలవాళ్ళు, చేసేవాళ్ళు యెవ్వరూ లేరు."

"చెప్పు శాంతా !......చెప్పు !"

"కూర్చో రామూ!"

ఆ యిసుకతిన్నెమీద యిద్దరూ కూర్చొన్నారు. ఆమె తన జీవితచరిత్రను చెప్ప ప్రారంభించింది.

"మనం కాలేజిలో చదువుతుండగానే తెలుసు నను కొంటాను నా దౌర్భాగ్యపుజీవితపు సంగతి."

"అవును."

"ఆ తర్వాత థర్డ్ యియర్ లో వుండగా మా మదర్ కూడ పోయింది. ఇంక నేను చదవటం మా ఫాదరుకు యిష్టం లేకపోయింది. నీవుకూడ ఆ సంవత్సరమే మద్రాసు వెళ్లావు బీ యం. ఏ. క్లాసుకు. ఇంక మన యిద్దరికి యెక్కువ పరిచయం కలుగలేదు. నీవు అదే వెళ్ళటం మళ్ళీ యివ్వాళ కనుపించావు. అంతా చిత్రం. తలవని తలంపుగా కలుసుకొన్నాం. కాలేజి మానేశాను మానాన్న బలవంతంవల్ల. ఇంట్లో మా అన్నయ్య, వదినెలకు వూడిగం చేయటానికి వుపయోగపడింది నా బి. యే. చదువు.

"మన లిటరరీ యాక్టివిటీసుసంగతి నీకు తెలుసుగదా! మన లిటరేచరంతా మా బ్రదరుకు చిరాకె త్తించేది. కొన్ని పుస్తకాలు నావి వాడు చింపాడు; పారేశాడు. ఒకనారి నిషే ధించిన పుస్తకం యెంతో ప్రయాసమీాద తెప్పించుకొని చదువు కొంటుంటే అది దాచాడు. వాడు యింట్లోలేనప్పుడు యెవ్వ

రినీ యింట్లో లేకుండ చూచి పెట్టెలు వెదికితే వాడి పెట్టెలో దొరికింది. బ్రదుకుజీవుడా అని అది దాచుకొన్నాను. అటు వంటి బ్రూటు వాడు.

"బహుశా యీమధ్య నా కథలు, వ్యాసాలు పత్రికల్లో చూచే వుంటావు. మావాళ్ళకు నేను కథలు పంపిస్తున్నా, నాకు వుత్తరాలు వస్తున్నా అనుమానం. ఒక్కొక్కప్పుడు వుత్తరాలు చింపి చూచేవాళ్లు. పొగడ్త లేమైనవుంటే ఆవేళ చిర్రు బుర్రు. పాపం! ఆ పత్రికాసంపాదకులకు నా యీ నికృష్టపుజీవితం సంగతేమి తెలుసు?"

"శాంతా! నీకు పత్రికలు వచ్చేవా నీవ్యాసాలుగాని కథలుగాని ప్రకటింపబడినప్పుడు?"

"కొన్నిమాత్రం!"

"ఈమధ్య గోలగావుంది తెలుగు పత్రికల విషయం గురించి. వ్యాసాలు పంపితే జవాబు వుండదనీ, కథలుగాని వ్యాసాలుగాని ప్రకటించినా ప్రతులు పంపరనీ, రెమ్యూనరేషను యివ్వకపోగా యీ మర్యాద బాగులేదనీ చాల శోచనీయంగా వుంది రచయితలపని. అలా నాకు అనుభవంవున్న మిత్రుడు చెప్పాడు. అత నిప్పుడు పంపటమే మానేసాడు లే."

"మరి నీకు పంపారా?"

"ఆఁ! నేను మారుపేరుతో వ్రాశేవాడిని. పత్రిక కొనుక్కొనేవాడిని. నా అడ్రసు యిస్తే ప్రమాదంకాదూ?"

"అవును. మన పత్రికాసంపాదకులందంతా ఒకతరహా. వారివుద్దేశ్య మేమిటో తెలియదు. ఇంగ్లీషుపత్రిక లలా కాదు. సమాధానం వెంటనే వస్తుంది. వేసుకొన్నా వేసుకోకపోయినా సమాధానమిస్తే బాగుండును. ఏమోలే! మన కెందుకు?"

"తరువాత?"

"రచనలు విప్లవపూరితా లని రిమార్కులు వచ్చినై, మానేశాను. రామూ! నీ వెక్కడున్నా నీ రచనలూ, నీ కార్యదీక్షా నాకు తెలుసు. ఆ నాలుగుగోడలమధ్యనుంచి తెలుసుకోగలిగే శక్తి నా కుంది. ఎప్పుడైనా నీ దర్శనం లభిస్తుం దాని చూచాను. ఎప్పుడూ కనుపించలేదు. మీ లలిత నప్పుడప్పుడు అడిగేదాన్ని. ఆమెకుమాత్రం యేం తెలుసు? ఎప్పుడో వచ్చి వెళ్తుండేవాడి వని చెప్పింది. కాని మనవూరు నెహ్రూ వచ్చినప్పుడు సామ్యవాదాన్ని గురించి నీ విమర్శనాపూర్వకమైన వుపన్యాసం రక్తనాళాల నన్నిటినీ వుడుకెత్తించింది. అది యిప్పటికీ నేను మర్చిపోలేదు. అప్పుడు చూచాను నిన్ను. కలుసుకోవటానికి వీలులేకపోయింది. మళ్ళీ కనపడలేదు. అవును. నిన్నెలా కనపడ నిస్తారు? నీవు దేశద్రోహివి. శాంతిభగ్నకారుడివి.

"తర్వాత తర్వాత నాన్న బాధ లెక్కువైనయ్. మా యింట్లోవున్న యింకా యిద్దరూ కూడ నన్ను వేధించుకు తినటం మొదలు పెట్టారు. ఎంతకాలం సహించనూ? ఇవ్వాళ యెందుచేతోగాని జీవితంలో భరించలేనంత బాధపడ్డాను. మా నాన్న తోడయ్యాడు.

"ఎక్కడైనా స్వతంత్రంగా బ్రతకలేకపోతానా అని బయలుదేరాను. నా జీవిత......"

"ఊఁ!" అని గట్టిగా నిట్టూర్చి "యెక్కడికి?" అన్నాడు.

"అగమ్యగోచరంగా."

"శాంతా! నా చరిత్రకూడ విను మరి."

"ఊఁ!"

"ఇవ్వేళే నేనుకూడ గృహపరిత్యాగి నైనాను. మా నాన్న పెళ్లివిషయమై పోట్లాడాను. ఇంక నన్ను గురించి యెక్కువ చెప్పను. నాకష్టా లెలాగో జీవితం వున్నంతవరకూ వున్నయ్. ఇప్పుడే...నీగానమోహితుడనై యిలా వచ్చాను. అంతా విచిత్రంగా వుంది."

"రామూ! నాకోర్కె చెల్లించి నన్ను రక్షించవూ?"

"............"

"............"

"అనేక కష్టాలు పడటానికి సిద్ధమై మనసార కోరుతున్నప్పుడు నేను తిరస్కరించగలనా?"

"రామూ!"

"శాంతా!"

ఆమె అతనిచేతిని తన చేతిలోనికి తీసుకొంది. ముద్దు పెట్టుకో బోయారు. చందమామ సిగ్గుచేత మబ్బులోకి పోయాడు. మసక చీకటి."

" ............ "

" క్లొక్లొ్కరో క్లో ! క్లో !! "

" రామూ ! రైలు నాలుగున్నరికి కాదూ ? "

" అవును పోదాం. "

3

నాల్గవనాడు.

పత్రికల్లో శాంతారాం దంపతుల పునర్వివాహపు చిత్రం ప్రకటితమైనది. వాళ్ళ తల్లిదండ్రుల హృదయాలు కుదుట పడినయ్ అప్పుడు. కాని క్రోధాగ్నిజ్వాలలు చల్లారలేదు. ఈ నూతనదంపతులను గురించి అనేకవిధాలుగా ఆడిపోసు కొంటున్నారు ప్రజలు. లోకులు కాకులట ! నిజమేనా ?

" శాంతారాం దంపతుల అరెస్టు దేశరక్షణచట్టానికి వ్యతిరేకంగా వుపన్యాస మిచ్చినందుకు. "

అని పత్రికలో శీర్షిక ఒక నెలరోజులకు.

ఊళ్ళోవాళ్ళంతా సంతోషించారీ వార్తకు, లేపుకు పోయినందుకు శిక్ష సరిగా పడిందని.

లోకం ! పాడులోకం !!

నానా తిప్పలుపడి యెలాగో తను వ్రాసిన కథలన్ని కలిపి ఒక సంపుటంగా అచ్చు వేయించుకొన్నాడు రాఘవరావు. ప్రెస్సువాళ్ళ సహాయంతోను, మిత్రుల సహాయంతోను ఆ సంపుటాన్ని బయట వేయగలిగాడు రెండు నెలలు ప్రయాసపడి. అవి యెలా అమ్ముకోవాలో తెలియలేదు. 'రైల్వేస్టేషన్లలో పుస్తకాలు అమ్ముతుంటారుకదా! వాళ్ళు యెప్పుడూ అనేక రకాల పుస్తకాలు అమ్ముతుంటారు. అక్కడ వాళ్ళకు యిస్తే బాగా ఖర్చవుతై. కొద్దిరోజుల్లోనే డబ్బువస్తుంది. బాగా, పబ్లిసిటీ అవుతుంది. వూళ్ళో నవ్వువాళ్ళ కిస్తే యేడాది కొకటి అమ్ముతారు. కాని తొందరగా డబ్బు కావాలి. అందుకు వాళ్ళకే యిసే మంచిది.' అని ఆలోచించాడు పాపం!

ఒకనాడు శుభముహూర్తం చూచుకొని రైల్వేస్టేషనుకు వెళ్ళి ఒకరితో చెప్పాడు. వారు మూడోనాడు వుదయం సూర్యునికంటె ముందుగా రాఘవరావు యింటికి వచ్చి కాపలా కాచారు. అతను లేవగానే ప్రత్యక్షం యీ పిశాచాలు.

అతను లేస్తూనే,

"ఓ! వచ్చారటోయ్! రండి! కూర్చోండి"

"ఆఁ! ఫర్వాలేదు లెండి!" అంటూ అక్కడవున్న బల్లమీద రాఘవరావు చూపించిన దానిమీద కూర్చొన్నారు. ఆ తరువాత సంభాషణ ప్రారంభించారు.

"ఏమండి మీపుస్తకాలు చాలబాగున్నయ్యండీ."

"మీ రెక్కడ చూచారు?"

"మొన్న స్టేషన్‌కి యెవరోతెస్తే చూచాము. మీ రేఁగిన వా రెవరో తెచ్చారు. చాల బాగున్నయ్యండి."

'నిజంగా బాగున్నయ్యా? లేక వీళ్ళు నన్ను ములగ చెట్టెక్కిస్తున్నారా? బాగుండకపోతే యిలా అంటారా? వాళ్ళ కేం పట్టింది అబద్ధం చెప్పాలని. మనం వ్రాసినయ్ బాగుండక పోతయ్యా? పత్రికల్లో రివ్యూలు కూడ చాలబాగ వ్రాశారే! నిజంగా బాగానేవుండి వుంటై. మనంకూడ ఒకరచయిత ననిపించు కొంటా మన్నమాట!'

అని తనలో మురిసిపోతున్నాడు. ముసళ్ళపండుగ ముం దున్నదని తెలియదు పాపం!

"మీ రిం కేమన్నా వ్రాశా రండీ?"

"లేదు...వ్రాశాను కాని అచ్చుపడలేదు. ఇదిగో యివి ఖర్చుపడితే ఆడబ్బుతో యింకోటి వేయిస్తా."

"అవును లెండి. మేం యిప్పుడు వీటికి ఒకనెలరోజులలో డబ్బు యిచ్చేస్తా మనుకోండి. అప్పుడు అవి అచ్చుపడినతరువాత వాటినికూడ యిలాగే తీసుకొంటాము."

"అంటే నెలరోజులంటారు—నెలరోజులవరకూ యివ్వరా యేమిటి డబ్బు ?"

"అది కాదండి. మీరు మాకు రెండువందల పుస్తకాలు యిప్పుడు పెట్టుబడిపద్ధతిగా పెట్టండి. ఆ డబ్బు వాయిదాలమీద తీర్చుకొంటాం. చివరకు మా ఖర్చునుబట్టి యింకా తీసుకుపోతాం. లేకపోతే మాచేత నోటు వ్రాయించుకోండి. మే మెక్కడ తీసుకొన్నా యిలాగే పట్టు కెళ్లుతుంటామండి !"

"ఆఁ ! నో ఎందుకులే ! మీరు వాయిదాలమీద యిస్తా మం టున్నారు గనుక రెండుమూడు వాయిదాలలో తీర్చివేస్తే నాకు, మీకు యిబ్బంది లేకుండ పోతుంది."

"అవునండి. వీలుగావుంటే మీ సొమ్మంతా పది, పదిహేను రోజుల్లోనే తీర్చేస్తామండి."

"సరే! మరీ మంచిది......"

"మరి కమీషన్మాటేమిటి ? మీ రెలా యిస్తున్నారో చెప్పండి."

"మీరే చెప్పండి. నా కింతవరకు తెలీదు."

"ఆఁ! మీ రే చెప్పండి. మీ రెలా యిస్తున్నారో చెప్పితే దానిమీద మే మడుగుతాం. ఇదివరకు మేం మూడోవంతుకు తెచ్చుకుంటున్నాం."

"సరే ! అలాగే నేనుకూడ యివ్వదలుచుకొన్నా. అంతా నేనే పొట్టలో పోసుకోవాలంటే మాత్రం సాధ్యమవుతుందా ?"

"ఇప్పుడు రెండువంద లివ్వండి."

రాఘవరావును ములగచెట్టెక్కించారుఆపాఢభూతిగాళ్లు. పిచ్చివాడికి యేమితెలియలేదు. కొత్తబిచ్చగాడికి పొద్దు తెలీ దంటా రిదే! అమాయక హృదయంలో మోసానికి తావులేదు. ఎవ రేదిచెప్పినా నిజమే నని నమ్మేస్వభావం అతనిది. తనను గోతిలో తోస్తున్నప్పటికీ తనమంచికోసమే నేమో నని సమా ధానపడే స్వభావంకలవాడు. అతనిని యే మనాలో తెలియదు.

వాళ్ళు అడగగానే వందేసి పుస్తకాలు కలిపి కట్టిన కట్టలు రెండు తెచ్చి వాళ్ళముం దుంచాడు. వాళ్ళకుకూడ పర మానంద మైంది, ఇంత సులభంగా బుట్టలోవేసుకొన్నా మని. తరువాత యెందుకూ పనికిరాని రశీదు ఒకటి గీకి వాడిముఖాన పారేశారు.

"మాకు రైలువేళవుతోంది. వెళ్లివస్తామండీ! శెలవు."

"ఆఁ! మంచిది...వుంటాను."

పరమానందంతో యింట్లో కొచ్చాడు వాళ్లను సాగ నంపి. వాళ్లు వ్రాసియిచ్చిన రశీదు పెదరావుగారి ఖాతాలో జమ కట్టుకోవాలని తెలియ దింకా పాపం! ఇంట్లోవాళ్లుకూడ సంతోషపడ్డారు రాఘవరావు ప్రయోజకత్వానికి. కాని దాని ఫలం యెలా వస్తుందో తెలియక అందరూ మోసపోయి సంతోషించారు.

౨

రాఘవరావు తన పుస్తకాలు పత్రికలకు పంపాడు విమర్శ నలకోసం. కొందరు పత్రికాధిపతులు ఆపుస్తకాలు యేమి చేశారో యేమో వాటి ప్రసక్తే లేదు. కాని కొందరుమాత్రం విమర్శలను ప్రకటించారు. అవి సవ్యంగానే వున్నయ్యనుకొన్నాడు రాఘవరావు.

పత్రికలు బయటపడగానే గ్రంథసమీక్షలు చూచే దేవ రంటే బుక్ సెల్లర్ కనకయ్యనే చెప్పాలి. కనకయ్య కున్నంత శ్రద్ధ యింకెవ్వరికీ వుండదు. అతనికి జీవనమే అది. ముందు ఆసమీక్ష చూచి ఆ గ్రంథకర్తల దగ్గరకు వెళ్ళి వాళ్ళదుంపతెంపి పుస్తకాలు కాజేసి వాటిని వంద యేనాల్గయిదు రూపాయలకో పేద కవుల గ్రంథ విక్రియ రక్తంతో పొట్టలు నింపుకొన్న పబ్లిషర్సుకు, చిల్లరగా అమ్ముకునే పుస్తకాలవాళ్ళకు యిచ్చేయటం ఆ డబ్బుతో నాలుగురోజులు త్రాగి తందనాలాడటం అతని ఉద్యోగం, జీవనం. ఈ విధంగా యిప్పటికి యెంతమంది నోటివద్ద జీవనం తీశాడో వాడికే తెలియాలి. ఇప్పటికి రెండు మూడు సార్లు అత్తవారింటికి పోయివచ్చాడుకూడ. ఇల్లూ వాకిలీ లేని బికారి నేం చేస్తేమాత్ర మేమి లాభం ?

వాడి విషపుచూపుల్లో పేదరాఘవరావు పుస్తకం పడింది. ఇతను క్రొత్తవాడిలాగ కనుపించాడు.' ఇతన్నిగురించి భోగట్టా చేశాడు. వచ్చి చేరాడు నెమ్మదిగా రాఘవరావువద్దకు.

" నమస్కారమండి "

"నమస్కారం."

"నేను రైల్వే బుక్కుసెల్లర్‌ని. మీ పుస్తకం చూచాను. చాల బాగుంది. మాకు ఇటువంటివి మంచి సేల్ వుంటుంది లెండి. మీవికూడ తీసుకొందా మని వచ్చాను."

"అలా కూర్చొండి."

"ఆఁ! ఫర్వాలేదులెండి." అంటూ ప్రక్కనేవున్న బల్లమీద కూర్చొన్నాడు.

"మీ కెన్ని కావాలి?"

"అయిదు వందలు కావాలి. నేను తీసుకొని వెళ్లి లోకల్ బుక్‌సెల్లర్సు కిస్తానండి. నాకు కొంచెం రేటు కనిపెట్టి వెయ్యాలండి."

"ఎలా తీసుకొంటారు?"

"ఖరీదులో సగం యిప్పించండి. మరి అయిదు వందలు ఒకసారి తీసుకొంటున్నప్పుడు ఆమాత్రం యివ్వకపోతే యెలాగండి?"

"డబ్బు యిప్పుడిస్తారా?"

"లేదండి రెండు రోజుల్లో సగంమొత్తం తీసుకొని వస్తాను. తర్వాత యింకో పదిరోజుల్లో మిగిలిం దిచ్చేస్తాను. మీకు కావలిస్తే యిదిగో చలసాని రామారాయ్‌గారు వ్రాసి యిచ్చిన క్రెడిట్‌బిల్లు. వారివి నాల్గువందలు తీసుకొన్నాను." అని క్రెడిట్‌బిల్లు చూపించాడు.

ఆ అభాగ్యుడితోపాటు యీ అభాగ్యుడుకూడ గోతులో పడుతున్నాడు.

వాడడిగిన పుస్తకాలు యిచ్చి వట్టి రశీదు వ్రాయించు కొన్నాడు. వాడుకూడ వుడాయించాడు.

రాఘవరావు వూహాసౌధాలు నిర్మిస్తున్నాడు రాబోయే ధనాన్నిగురించి. వాళ్ళు పెట్టినగడువు తప్పింది. ఇంకా నాల్గు రోజులు గడిచినై. ఇతనికి తొందరపుట్టిం దిప్పుడు. విచారించటం ప్రారంభించాడు వాళ్ళనుగురించి. వాళ్లకేమిలేదని, వాళ్లవుద్యోగాలే యివని, తనవంటివాళ్ళు యింకా చాలమందయ్యారని తెలిసింది. ఏంచేస్తాడు? నెత్తి నగుడ్డేసుకొని యేడవవలసిందే!

తనతోడి అభాగ్యులను కలుసుకొని తనగోడంతా తెలిపి విచారించాడు. ఆ పుస్తకాలు అణాకు అర్ధణాకు అమ్మటం చూచాడు స్టేషనులో.

ఏ స్టేషనుకు వెళ్లి యెవర్ని బ్రతిమాలి కొరివిపెట్టి తల గోకుకొన్నట్టు తద్దినం తెచ్చిపెట్టుకొన్నాడో, వాళ్లే ఆ స్టేషనులోనే పుస్తకాలు ఆతక్కువధర కమ్మటంచూచి సహించలేక పోయాడు. లేక చేసే దేముంది?

కనపడినవాళ్ళకందరకు మాత్రం చెప్తున్నాడు వాళ్ళను గురించి. ప్రెస్సువాళ్ళబిల్లు చెల్లించటానికి బ్రహ్మప్రళయమై పోయింది పాపం!



ఆవేళ స్కూల్ ఫైనల్ పరీక్షా ఫలితాలు పత్రికల్లో ప్రకటింపబడ్డాయ్. చంద్రశేఖరం ప్యాసయినట్లు తెలిసింది.

ఊళ్ళోవాళ్ళంతా సంతోషించారు. కాని యేపుస్తకాలు కొనకుండా అన్నీ ముష్టెత్తుకొని చదివినవాడు వీడే ప్యాసయ్యాడు. అన్నీవుండి చదివిన మనం ప్యాసుకాలేక పోయామేమి టని అసూయపడే లుబ్ధాగ్రేసరచక్రవర్తులు తప్ప చంద్రశేఖరంవిజయం అందర్నీ సంతోషపరిచింది.

అతని ముసలితండ్రి చిన్న చెల్లెలు సంతోషం పట్టలేకుండ వున్నారు. చంద్రశేఖరం మాత్రం యితరులు సంతోషించినంతగా వుత్సాహపడటంలేదు. అతనికి కళాశాల విద్యకూడ పూర్తిచేస్తేగాని విశ్రాంతి వుండదు. అంతవరకు అంతసంతోషించవలసిన అగత్యం లేదతనికి. ఉద్దేశ్యం పూర్తి కావాలి. అప్పుడు తృప్తిజెందాలి. అందువల్ల కొంచెం మనోవేదన అనుభవిస్తున్నాడు కళాశాలవిద్య కొనసాగేమార్గ మేదాని. కళాశాలకు వెళ్ళినదగ్గరనుంచి చాలఖర్చు నెత్తినపడుతుంది. కనీసం రెండు వందల రూపాయలైనా కావాలి సంవత్సరానికి. ఇప్పటివరకంటే హైస్కూల్లో యిచ్చే స్కాలర్షిప్పుతోను, పుస్తకాల ఖర్చు లేకుండా భోజన ఖర్చు వేరే లేకుండా గడిపాడు. ఇప్పుడలా జరిగే విధానం కనుపించటంలేదు. కాని ప్రయత్నం మానటంలేదు.

ఎంతో శ్రమపడి ఒక సంవత్సరానికి తనకు కళాశాల విద్యకు కావలసిన ధనాన్ని సంపాదించాడు. ఆ డబ్బుకోసం యెన్నో అవమానాలు పొందాడు. విసుగు విరామం లేకుండ ఒక్కొక్క షాహుకారివద్దకు నాల్గుసార్లు తిరిగి యెంతిచ్చినా పుచ్చుకొని నానా అవస్థపడి ఆ యేటికి డబ్బు సమకూర్చు కొన్నాడు కళాశాల తెరిచేరోజులు వచ్చేటప్పటికి.

విశాఖపట్టణం వెళ్ళాడు తన ముసలి తండ్రిని చిన్న చెల్లెల్ని విడిచి వెళ్ళలేక వెళ్ళలేక. వెళ్ళక తప్పదు. వెళితే వీళ్ళగతి ?......వాళ్ళదే !

౨

చంద్రశేఖరం చాల పేదవాడు. వాళ్ళ కున్న స్థిరాస్థి చాల తక్కువ. తల్లి లేదు. వృద్ధుడైన తండ్రి ఒకచిన్న చెల్లెలు మాత్రం వున్నా రతనికి ఆ ప్తబంధువులు.

ఊళ్ళో చందాలు ప్రోగుచేసుకొని చదువుకొంటున్నాడు. ఉదయం తనూ, చెల్లెలు అవస్థపడి నాలుగు మెతుకులు వుడ కేసుకొని తిని పది గంటలకు వాళ్ళ గ్రామానికి నాలుగుమైళ్ళ దూరంలోవున్న హైస్కూలుకు నడిచిపోతాడు. మళ్లా తిరిగి సాయంకాలమే యింటికి రావటం. ఈ లోపున భోజనం వుండ దతనికి పాపం !

తన చెల్లెలుమాత్రం యింటివద్ద తండ్రిని కనిపెట్టుకొని వుంటుంది. చంద్రశేఖరం యింటికి రాగానే సాయంత్రం యథా ప్రకారంగా సాంధ్యకృత్యాలన్నీ అయిన తర్వాత రాత్రి యే డెనిమిది గంటలవరకు వంటింట్లో గడపాలి. తరువాత ప్రొద్దు పోయేవరకు చదువుకొంటాడు మినుకు మినుకు మంటున్న బెడ్ రూమ్లైట్ ముందు కూర్చొని. ప్రతిరోజు యెనిమిదిమైళ్లు నడిచి యింట్లో వంటవ్యవహారాలు చూచుకొని రాత్రి యెనిమిది గంటలకు చదువు ప్రారంభిస్తే యెంత హాయిగా వుంటుంది? అంతకంటే అతనికి వీలులేదు మరి. ఈ విధంగా అష్టకష్టాలు పడుతూ ముసలి తండ్రిని సాకుతూ తన చదువుకు భంగం లేకుండ చూచుకొంటూ క్లాసులో మాష్టర్ల సానుభూతి పొందుతూ తెలివితేటలతో ప్రవర్తిస్తున్నాడు. క్లాసులో మార్కులు బాగా సంపాదించి అందరిచేత ఆదరింపబడు తున్నాడు. ఇంతవరకు ఆవిధంగా గడిచిం దతని హైస్కూలు జీవితం.

## 3

కళాశాలలో ప్రవేశించాడు. అధికారులు, అడ్డమైనవాళ్ల దగ్గరకు వెళ్ళి తెచ్చుకొన్న పావర్టీసర్టిఫికేట్లు, రికమండేషన్ వుత్తరాలు చూచి కొంతవరకు జీతం తగ్గింపుయేర్పాట్లు చేశారు.

వారి, వీరి సహాయాలవల్ల, ఆ పట్టణంలోవున్న పెద్దల భోజన సహాయంవల్ల కాలం గడుపుతున్నాడు.

కళాశాలలోకూడ మంచి పేరు సంపాదించుకొన్నాడు. ఉపన్యాసకుల దయాకిరణాలు యితనిమీద ప్రసరించాయ్. బుద్ధిమంతు డని అందరూ గౌరవిస్తున్నారు. అనవసరమైన దుబారాఖర్చుచేయకుండాను, తనచదువుకు భంగంరాకుండాను, యింకొకరింట్లోవుంటే వారి కిబ్బంది యేమి కలగకుండాను వేరే ఒక గదిమాత్రం ప్రత్యేకంగా తీసికొని కావలసినవాటికీమాత్రం ఖర్చు చేస్తూ పుస్తకాలు కళాశాలపుస్తకభాండాగారంనుంచి తెచ్చుకొని చదువుకొంటూ కాలం వెళ్లబుచ్చుతున్నాడు. అల్లరి చిల్లర స్నేహాలు చెయ్యకుండా యోగ్యుల సహవాసం చేస్తున్నాడు.

మొదటి సంవత్సరం ఆవిధంగా సవ్యంగా గడిచింది. మంచి మార్కులు సంపాదించాడు. ఉపన్యాసకులు మరింత దయతో చూస్తున్నారు. రెండవసంవత్సరంలో జీతం పూర్తిగా తీసివేశారు. అతనికి ఆర్థికంగా అంతకష్టం లేకుండపోయింది.

రెండవ సంవత్సరంలో యూనివర్సిటీపరీక్షల్లో మొదటి తరగతిలో వుత్తీర్ణుడయ్యాడు.

ఇక్కడ పరగ్రామంలోను, అక్కడ స్వగ్రామంలోను అందరిచేతా ఆదరింపబడుతున్నాడు.

## ౪

చంద్రశేఖరం చెల్లెలు సత్యవతి స్వయంకృషితో తన కున్న అక్షరజ్ఞానాన్ని వృథా పోనివ్వకుండా అభివృద్ధి గావించు కొంటోంది. తన సహాధ్యాయులవద్దనుంచి పుస్తకాలు తెచ్చి చదువుకోవటం, యేమైన తెలియని విషయా లుంటే తెలిసిన వాళ్లనడిగి, అన్న శెలవుల్లో వచ్చినప్పు డడిగి తెలుసుకోవటం మూలంగా ప్రపంచజ్ఞానం కూడ కొంత ఆర్జించింది.

ఆమె యిప్పుడు పెద్దదైంది. ఒకరికి బుద్ధి చెప్పగలిగి నంత జ్ఞానం సంపాదించింది. ఇదంతా స్వయంకృషివల్ల వచ్చిందే. పేదవాళ్ళకుకూడ మేధాశక్తి, తెలివితేట లుంటయ్. నిరక్షర కుక్షి గాకుండా విద్యావంతురాలైంది. విద్యావంతు లంటే డిగ్రీ లున్నవాళ్ళే కాదు. ఎవరికి ప్రపంచజ్ఞానం యెక్కువగా తెలిసి సంస్కారబుద్ధితో తెలివిగా వుంటారో వాళ్ళే నిజమైన విద్యావంతులు కాని మోయలేని బరువుగల డిగ్రీలు తగిలించు కొని మర్యాదా మన్నూ తెలియక సంస్కారం పొందనివాళ్ళు విద్యావంతులుకారు. విద్యావంతుల మనుకొనే వింతపశువులు. సత్యవతి విద్యాపశువు కాదు. నిరక్షరకుక్షీ కాదు.

సత్యవతి పెద్దదవటంతో చంద్రశేఖరానికి సంసారభారం నెత్తినపడింది. కుటుంబచింత, యెక్కువైంది. తను మధ్యలో విద్యకు స్వస్తి చెప్పితే యింతవరకూ పడిన కష్టమంతా వృథా! బూడిదలో పోసిన పన్నీరుచంద మవుతుంది. ఇంకా రెండు

సంవత్సరాలు కష్టిస్తే ఫలితం దక్కుతుంది. పట్టభద్రుడైతే యేదోవిధంగా తన కుటుంబాన్ని పోషించుకోగలననే ధైర్యం, ఆశ మెండుగా వున్న య్యతనికి. ఇటు సంసార తాపత్రియంలోను అటు విద్యమీదవుండే అభిలాషంలోను రెండిటిమధ్య పడి దారీతెన్ను గానక కొట్టుకొంటున్నాడు.

చివరకు చెల్లెలు ప్రోత్సాహంతో వుత్సాహం గలిగి చదువు పూర్తిచేయటానికి వచ్చాడు మళ్ళీ కళాశాలకు.

౨౨

ఒకనాడు కళాశాల ప్రిన్సిపాల్, కుమార్తె చదువుకోసం పట్టణనివాసం చేస్తున్న నాగేశ్వరరావుగారు యిష్టాగోష్టిలో నుండగా కాలేజిలోనున్న విద్యార్థుల్లో తెలివిగలవాళ్ళను గురించి సంభాషణ బయలుదేరింది.

ఆసందర్భంలో ప్రస్తుతం బి. ఏ. క్లాసు చదువుతున్న వాళ్ళల్లో చంద్రశేఖరం తెలివైనవాడనీ, కష్టపడి చదువుతాడనీ, కాని బహుపేదవాడనీ ప్రిన్సిపాల్ నాగేశ్వరరావుతో చెప్పాడు.

నాగేశ్వరరావు శ్రీమంతుడు. అయన కొక్కతే కుమార్తె సరోజిని. ఆమె నెంతో గారాబంగా పెంచారు. తల్లిలేని పిల్లని అడుగు క్రింద పెట్టనియ్యకుండా పువ్వుల్లో పెట్టి పెంచారు.

నాగేశ్వరరావుకు కొడుకైనా కూతురైనా ఆమెయే. భార్య పోయినతర్వాత మళ్ళీ పెళ్లి చేసుకొంటే తనకూతురుగతి యేమవుతుందోనని మళ్లీ పెళ్లి చేసుకోలేదు. ఆడపిల్ల గాబట్టి అతి అల్లారు ముద్దుగా పెంచారామెను. ఇప్పుడామె చదువుకోసం ప్రత్యేకంగా విశాఖపట్టణంలో కాపురం పెట్టారు.

శ్రీమంతులు వారి కేం? ఎక్కడున్నా మహారాజభోగం అనుభవిస్తారు. ఎటొచ్చీ పేదవాళ్ళపనే పిల్లంకనవుతుంది.

సరోజిని యీసంవత్సరం యింటర్ మొదటి తరగతిలో ప్రవేశించింది. ఆమె అతిచురుకుగా చదువుతుంది. చదువుగొడవ తప్పితే యింకొక టామెకు లేదు. ఎంతసేపు కాలేజిపుస్తకాలు, తను తప్ప యింకోవిషయం ఆమెను తెలియదు. తెలుసుకోవటానికి ప్రయత్నించదు. ఆమెను కాలేజివిద్యార్థులు 'రుబ్బరు' అని హేళనచేస్తుంటారు. ఇంతా కష్టపడి చదివినా క్లాసులోయెప్పుడూ మామూలుగానే వుంటుంది గాని మొదటి మార్కులు రావు. ఎలాగైనా కావలసినంత డబ్బుంది కాబట్టి తెలివిగలదనాలి.

నాగేశ్వరరావు చంద్రశేఖరంసంగతి విని జాలిపడి సానుభూతి తెల్పాడు.

౬

చంద్రశేఖరం కష్టాలు తొలిగిపోయినై. అతని అదృష్ట చక్రం తిరిగింది. నాగేశ్వరరావు ఆదరించాడు. అదివరకు

చేస్తున్న వారాల భోజనం మానేశాడు. డబ్బు కాట్టే ఇబ్బంది పడ నక్కరలేదు. అన్ని విధాల ఆదరం పొందుతున్నాడు.

అతని స్థితితోపాటు మనిషికూడ పూర్తిగ మారి పోయాడు. పూర్వం అందరితోను యెవరితో యేం పనుందో నని అతివినయంగా మాట్లాడేవాడు. ఇప్పుడు మాట్లాడటమే కష్టంగావుంది. పలుకే బంగారంగా వుంది.

ఎక్కడ, యేవేళప్పుడు చూచినా చంద్రంగారు ప్రత్యక్షం. ఏసినిమాహాల్లోను, యే కాఫీహోటల్లోను, యే పార్కులోను వారే! "ఇందు గల డందు లేడను సందేహము వలదు." పట్టణ మంతా వారిపాదాక్రాంతం. వెంట యెప్పుడూ నలుగురు ముగ్గురు స్నేహితులు వుంటారు రక్షకభటుల్లాగ.

సంవత్సరాంత పరీక్షలొచ్చినై. విద్యార్థు లంతా కష్టపడి తెల్లవార్లు మేల్కొని చదువుతున్నారు. మునిసిపాలిటీ దీపాల్లాగ విద్యార్థుల గదుల్లో దీపాలు తెల్లవార్లు వెలుగుతున్నై.

చంద్రశేఖరం గదిలోకూడ పన్నెండుగంటలవరకు విద్యుద్దీపం వెలుగుతుంది కాని తక్కినవిద్యార్థుల్లాగ చదువుమాత్రం వుండదు. అతను పరీక్షలకు సరిగా వెళ్ళలేదు. వెళ్ళిన పరీక్షలో కూడ సరిగా వ్రాయలేదు. అధికారులు యేమోననుకొన్నారు. నాగేశ్వర్రావు చూచిచూడనట్లు వూరుకొన్నాడు. ఆయన పరీక్షల కెళ్ళినా వెళ్ళకపోయినా ఒకటే.

నాగేశ్వరరావు పలుకుబడివల్ల చంద్రశేఖరం నాలుగో సంవత్సరానికి ప్రమోట్ చేయబడ్డాడు. ఇంతలో పిడుగువంటి వార్త వచ్చిందొకటి యింటివద్దనుంచి. తండ్రికి చాలప్రమాదం గావుంది. వెంటనే యింటికి వెళ్ళాడు. ఊళ్ళోవాళ్ళంతా ఆశ్చర్య పోయారు, చంద్రంలో, ఒక సంవత్సరంలోనే కల్గిన యీవిపరీత మైన మార్పుకు. మొదట్లో యీ మార్పుకు కారణం తెలి యక చాల ఆవేదనపడ్డారు ప్రజలు. తెలిసిన తర్వాత శాంతిం చింది గ్రామం.

ఎవడైన కొంచెం పేదదశలోనుంచి, వృద్ధిస్థితిలోని కొచ్చాడంటే యింక వాడికి పుట్టగతులుండవ్ యీస్వార్థ ప్రపంచంలో. ఆగతే పట్టింది మన కథానాయకునికి.

చంద్రంతండ్రి రామయ్య అచిరకాలంలోనే అందరినీ విడిచి పెట్టి శాశ్వతశాంతిని పొందాడు.

ప్రాణాలు పోయేటప్పుడు కొడుకును దగ్గరకు పిల్చి మంచంమీద కూర్చోపెట్టుకొని—

“నాయనా చంద్రం! నీకు పెద్ద అండ లభించినందుకు సంతోషంగావుంది.........నేను నీకు సంపాదించి యిచ్చిం దేమిలేదు గాని............మరి నీ తల్లి తండ్రి లేని చెల్లెల్ని యెలా చూచుకొంటావో?............ఎంత వుబలాటపడ్డా నా కళ్ళతో వీళ్ళ సంసారాలు చూడలేక పోయాను.........ఊం!...............”

"నాన్నా! మీకా భయమేమి అక్కరలేదు....నా చెల్లెల్ని నేను చూచుకోవటం నాకు కష్టమా?......అందులో సత్యవతి నాకు రెండో ప్రాణం......" అని తండ్రివంక సంతోషంతో చూచాడు. ప్రక్కనే నిలబడివున్న సత్యవతి ఆనంద బాష్పాలు రాల్చింది, అన్న ఆదరణ వాక్యాలకు.

ముసలిప్రాణి ఆతురతతో

"బాబూ! సత్యవతి జాగ్రత్త! నువ్వుకూడ నలుగురిలో మంచిగావుంటేనే సుమా!......ఆఁ?......"

అని కొడుక్కు అంతిమసందేశాన్నిచ్చి తన సంతానాన్నొకసారి చూచుకొని కళ్ళు మూశాడు శాశ్వతంగా. తరువాత జరుగవలసిన తతంగం అంతా జరిపి సత్యవతితో కూడ విశాఖపట్టణం జేరాడు చంద్రం. నాగేశ్వరరావుకూడ నలుగురితోపాటు విచారించాడు కాసేపు.

౭

చంద్రశేఖరం గదిలోనికి సరోజినిదేవి రావటం, అదీ యిది తెలియలేదంటూ అడగడం, చెప్పించుకోవటం ఛలోక్తులు విసరటం జరుగుతూంది.

కొంతకాలం జరిగేటప్పటికి వ్యవహారం ముదిరింది. వికారచేష్ట లిద్దరూ చెయ్యటం మొదలు పెట్టారు. వారిస్నేహం, చనువు అంత్యదశలో కొచ్చినై.

నాగేశ్వరరావు యిదంతా చూచినా చూడనట్లుగానే ఫూరుకొంటున్నాడు, ఆయన ఉద్దేశ్యంకూడ అదే కాబట్టి.

ఆసంవత్సరం నిర్లక్ష్యంగా చదవటంవల్ల చంద్రశేఖరం బోల్తాకొట్టాడు. సరోజిని జాగ్రత్తగా చదివింది కాని సహవాస దోషంవల్ల అంత శ్రద్ధ పుచ్చుకోలేదు.

ఎలాగో అవస్థపడి మరుసంవత్సరం సెప్టెంబరు పరీక్షలో నెగ్గాడు. పట్టభద్రుడయ్యాడు. చంద్రశేఖరం బి. ఏ. అని పించుకొన్నాడు.

అత్యంత వైభవంతో ఆనందసాగరంలో వివాహ నౌకమీద చంద్రశేఖరం బి. ఎ. ను, సరోజినిదేవిని యెక్కించారు. ఆనౌక యెక్కడా యేవిధమైన తుపానుగాలులకు గురి కాకుండ శరవేగంతో ప్రయాణంచేస్తోంది.

చంద్రశేఖరం మామగారి ఆస్తికి సర్వాధికారి అయ్యాడు ప్రస్తుతం అనుభవించటానికి మాత్రం. 'If luck fucks who is there to check ?' అంటారు పెద్దలు, అదృష్టవంతుని చెరుప లేరని.

నాగేశ్వరరావు సత్యవతికికూడ మంచి సంబంధం విచారించి వివాహం చేశాడు. రెండు సంసారాలు సవ్యంగానే సాగి పోతున్నై.

వివాహంతో సరోజిని చదువుకు స్వస్తిచెప్పింది. మామగారు యెంత పోరుపెట్టినా చంద్రం యింక చదువుమాట తల పెట్టటం మానేశాడు.

౮

పనిలేని శ్రీమంతులకు కావలసినంతపని కల్పిస్తారు మొహార్బానీ స్నేహితబృందం. ఎప్పుడు కొంచెంబెల్లం వుంటే అప్పుడే జేరతాయి నాలుగు చీమలు. ఆ బెల్లం కాస్త నాకేసిం తర్వాత వాటిదారి నవి పోతాయి, మళ్లీ యింకో చోటికి, ఆహార సంపాదనార్థమై. అలాగే యీ మొహార్బానీ స్నేహితులు కూడాను.

చంద్రశేఖరానికి సినిమా పిచ్చెత్తించారు స్నేహితులు. అమెరికా ప్రయాణం కట్టాడు, డైరెక్షన్ నేర్చుకురావటానికి. అతని శ్రేయోభిలాషులు అనేకవిధాల వద్దని చెప్పారు. బ్రతిమాలారు కాని వినలా! చెప్పటంకూడ మానేశారు నాగేశ్వరరావు దగ్గరనుంచి.

౯

ఆవేళ చంద్రశేఖరానికి స్వగ్రామంలో గొప్ప ఆహ్వానం యిచ్చారు, అమెరికానుంచి సంవత్సరానికి తిరిగి వచ్చినందుకు. ఒక్క సంవత్సరం వ్యయప్రయాసల కోర్చి డైరెక్షన్ శ్రద్ధగా నేర్చుకొచ్చాడు.

దానిఫలితం?

పూనాలో ఫిల్ముతీసే యేర్పాటులు అతిచురుకుగా సాగుతున్నై. షేరుహోల్డర్లు యెవ్వరూలేకుండ అంతా తనే భరించి సినిమా కంపెనీ ప్రారంభించి ఫిల్ముతీయటం మొదలుపెట్టాడు.

కథకుడు, ప్రొప్రైటరు, దర్శకుడు, నటకుడు, మేనేజరు అంతా చంద్రశేఖరమే. షూటింగు జోరుగా జరుగుతోంది. ఏ పత్రికలో చూచినా డైరెక్టరు చంద్రంగారి 'దేశసేవిక' అనే ఫిల్ము ప్రకటనలే! ప్రజ లందరికి బాగా తెలిసింది. తోటివాడు చిత్రనిర్మాత అవుతున్నాడంటే కొందరు సంతోషించారు. కొందరు తిట్టారు, అసూయాపరులు.

ఏది యెలా వున్నా డైరెక్టరు కథానాయకునిపాత్రధరించి ఫిల్ము తయారుచేస్తున్నాడు. కథానాయకి లీలకు ప్రత్యేకంగా రిహార్సెల్సు డైరెక్టరింటివద్ద యేర్పాటుచేశాడు.

ఆ సినిమాలో నాయకులు ఆంగ్లనృత్యం చేయాలిసిన ఘట్ట మొక టొచ్చింది. ఆ సీనులోమాత్రం యిద్దరూ హృదయాలను కలుపుకోలేకుండ వుండలేక పోయారు!

లీలాదేవికి పబ్లిసిటీ యిదివరకుకంటె మూడు రెట్లెక్కువగా వుంది. కారణం ప్రజలకు దురూహ్యం. ఏమో ననుకొన్నారు.

వేసుకొన్న లెక్కప్రకారం పని జరగనందువల్ల యింకా సగంసొమ్ము కావలసి వచ్చింది. పూనానగరంలో యెవరు వీళ్ళ మొఖం చూచేది? మామగారిని మర్యాదగా అడిగితే మాట

దక్కదు. ఇదివరకే యెంతో ధుమధుమలాడి సుతలాము యిష్టంలేక యిచ్చాడు, ఆ యిచ్చిన సొమ్మంతాకూడ.

ఇక్కడ ఫిల్ముపని మందగించింది.

డైరెక్టరు చంద్రశేఖరం బి. ఎ. గారు ప్రకటించిన చిత్రం తాలూకు యెడ్వర్టయిజుమెంటు కనపడకపోయే టప్పటికి ప్రజలు అనేకవిధాలుగా అనుకొన్నారు. లోకులు పలుగాకులు!

ఎలాగైనా ఫిల్మును విడుదల చేయాలని పట్టు పట్టాడు చంద్రశేఖరం. ఇక్కడితో మానేస్తే యిప్పటికి ఖర్చుపెట్టిన లక్షరూపాయలు వృథాగా దండుగ. ఇంకా నటకులకు, స్టూడి యోకు వున్న బాకీలు చెల్లించాలి. అవన్నీకూడ దండుగే అవు తుంది. కాబట్టి ఫిల్ము విడుద లయిందంటే ఖర్చుపడ్డా పేరైనా వుంటుంది బాగున్నా లేకపోయినా. అది డైరెక్టరు వుద్దేశ్యం.

సరోజినితో మామకు చెప్పించాడు. ఆయన కస్సు మన్నాడు. చుట్టమై వచ్చి దయ్యమై పీక్కుతిన్నట్టుగా వుందే యీ వ్యవహార మని కోపగించుకొన్నాడు. ఏ మాత్రం లాభం లేకపోయింది.

## ౧౦

ఆవేళ తెల్లవారేటప్పటికి వూరంతా మారుమోగి పోతోంది. నాగేశ్వరరావుగారి హత్యను గురించి చాల వింతగా చెప్పుకొంటున్నారు.

సరోజిని చంద్రశేఖరంలు పూనానుంచి దిగారు యీ మరణవార్త విని. సరోజిని దుఃఖాన్ని పట్టలేకుండవుంది. ఆమె దుఃఖాన్ని చూడలేకపోతున్నారు. చూట్టానికి వచ్చిన బంధుకోటి ఎంత విచారించినా యేమీ ప్రయోజనంలేదని ఓదారుస్తున్నారు. ఇంక నంతకంటె యెవరు మాత్రం యేంచెయ్య గల్గుతారు!

డైరెక్టరు ఆదుర్దాగా అమాయకుడిలాగ నలుగురితో పాటు కళ్ళెంట నీళ్ళు పెట్టాడు. సరోజినిని ఓదార్చాడు యెంతో ఆదుర్దాగా. కాని ముఖంలో భయం స్పష్టంగా కనుపిస్తోంది. దొంగతనం దాయాలంటే మాత్రం దాగుతుందా? సాధ్యమా?

## ౧౧

డైరెక్టరు అరెస్టుతో ఫిల్ము ఆగిపోయింది. లీల యిక్కడికి జేరింది, డైరెక్టరు కోరినప్రకారం.

జామీనుతో విడుదలయ్యాడు. మిగతావారికి ధన సహాయం లేకపోవటంవల్ల అలానే వుండిపోయారు. సరోజిని ఆశ్చర్యపోయింది. తలవనితలంపుగా తనభర్తని అరెస్టుచేసినందుకు ఆమెకు కారణం తెలియలేదు. ఇంకోవేదన చుట్టుకొంది. ఒకప్రక్కన తండ్రి మరణానికే దుఃఖిస్తుంటే భర్త జైలుకు వెళ్ళటం మూలిగేనక్కమీద తాటికాయ పడినట్లుగా అయ్యింది

ఆమెపని. కేసు రెండోకోర్టు కెళ్ళింది. కాలం జరిగిపోతోంది వాయిదాలమీద వాయిదాలతో.

ఒకనాడురాత్రి:

చంద్రశేఖరంకు చాలప్రొద్దుపోయేవరకు నిద్రలేదు. దీర్ఘంగా ఆలోచిస్తూ విచారవదనంతో కూర్చున్నాడు. డ్రాయరు మీద తలనాన్చి ఆలోచిస్తున్నాడు. నెమ్మదిగా చప్పుడుగా కుండ సరోజిని వచ్చి అతని కుర్చీవెనుక నిలబడివుంది. అత డది గమనించనే లేదు.

కొంతసేపటికి పెద్దవేడి నిట్టూర్పు విడిచి తలపైకెత్తాడు. సరోజిని వెనుక వున్నట్టు తెలిసికొని వులిక్కిపడ్డాడు. తనమనో భావాలన్నీ ఆమె కనిపెట్టిందేమోనని భయపడ్డాడు. దాన్తో మరీ కృంగిపోయాడు మానవుడు.

'ఏమి టాలోచిస్తున్నారు?'

'..............'

'..............'

'..............'

'ఇంత ప్రొద్దుపోయిందాకా మేల్కొన్నా రేం?'

'ఏ...మి...లేదు.'

'ఏదో ఆలోచిస్తున్నట్టుంది?'

'ఆఁ! ఊరకే నిద్రపట్టక కూర్చొన్నాను.'

'ఎందుచేతో ?'

'ఏమో ? సరోజినీ !'

'............'

చంద్రశేఖరం తలవంచుకొన్నాడు. చెప్పాదామన్న మాటలు నోటివెంట రాలేదు.

అయిపోయినదానికి విస్తారు విచారించినా లాభంలేదు. యెవరు విచారించినా లాభంలేదు. మనం విచారించినందువల్ల పోయిన మానాన్నగారు యెలాగూ రారుకదా ? ఇం కెందుకు విచారం ? అని కళ్ళెంట నీళ్ళు పెట్టుకొంది.

ఆమెముఖాన్ని చూస్తుంటే చంద్రశేఖరానికికూడ కళ్ళెంట నీళ్ళుకారినై, పశ్చాత్తాపకణాలు.

'నన్ను క్షమించు సరూ !' అని ఆమెరెండు చేతులూ పుచ్చుకొన్నాడు.

'ఆఁ !'

'ఏమిలేదు......క్షమించు.....నేను కృతఘ్నున్ణి....' కంఠం బొంగురుపోతోంది. 'నీకు చాల ద్రోహంచేశాను...... మీా నాన్నమేలు మరిచాను.'

'ఏంచేశారూ ?' ఆమె దుఃఖాన్ని పట్టలేక చిన్నపిల్లాగ యేడుస్తూ ఆత్రుతతో అడిగింది.

'ఇంకా యేం చేయాలి ?'

'ఆఁ!.........ఈ సంగతి నిజమేనా? నే నిదివరకే కర్ణాకర్ణిగా విన్నాను.....ఎలా నమ్మను?.....నిజమేనా!'

"............"

ఒక వేడి నిట్టూర్పు విడిచి యెదురుగావున్న కుర్చీలో కూర్చొంది. తలవంచి రెండు చేతులతోను పట్టుకొని ముందుకు వంగి విచారపడుతోంది.

అయిదునిముషాలవర కెవ్వరూ మాట్లాడలేదు. అంతలో ఒంటిగంట కూడ కొట్టింది. గడియారం మోతతోపాటు సరోజిని ప్రారంభించింది తల పైకెత్తి కళ్లు తుడుచుకొంటూ.

'ఇప్పుడు విచారిస్తే వచ్చేఫలిత మేముంది?'

' '

'............'

'నన్ను ఆ ఫిలింపిచ్చి విచక్షణాదృష్టివిహీనుణ్ణి చేసింది సరోజినీ! వెనుక ముందు లాలోచింపనీయలేదు. దానికి తగిన ప్రోత్సాహంకూడ దొరికింది.'

'సరే, అయిపోయిం దేదో అయింది. యిప్పుడు కర్తవ్యం చూడాలిగా!'

'ఏం కర్తవ్యం చూడనక్కరలేదు. నాకు యీ మానవ లోకంలో యెవ్వరూ శిక్ష విధించలేరు. ఈ న్యాయస్థానాలు విధించే శిక్ష చాలదు సరూ! ఈ ద్రోహికి శిక్షలేదు. నువ్వనవసరంగా కష్టపడబోకు.

ఆమె ఆశ్చర్యంతో చూస్తోంది. ఈ వున్మాదుని అవస్థ ఆమె కేమి బోధపడటంలేదు.

'నేను యివ్వాళ జడ్జిగారి వైఫ్‌ను చూచాను. ఆవిడ సహాయం చేస్తానంది. వాళ్ళమేలు మరవ నని చెప్పాను. ఆవిడ చాల సంతోషించింది. మనకు అనుకూలం కావచ్చు. అనవస రంగా మీరు విచారించి మనస్సును కల్తపర్చుకోకండి !'

'నాకు శిక్ష లేదు సరూ !'

'మీ రలా విచారిస్తే వచ్చే ఫలితం ? నాకులేని దుఃఖం మీ కెందుకు ?'

'ద్రోహంచేసినందుకు.'

'అయిపోయిన పెళ్ళికి బాజా లెందుకు ?'

'పశ్చాత్తాపం పాపపరిహారం కదూ !'

'పొరపాటు. పశ్చాతాప పడేవాడు దొంగ, ద్రోహి. అంతా కపటనాటకం. ప్రజలను మోసంచేయటాని కదొక సాధనం. అంత పశ్చాత్తాపపడేవాడు మొదటే విచారించి యే కార్యమైనా చేస్తాడు. నిజమైన పశ్చాత్తాపం మొదట ఆలోచన కలిగినప్పుడే కలుగుతుంది. కాని చివరకు జరిగినదంతా తన తప్పును సమర్థించుకోవటానికి ఆడే నాటకం.'

'............'

'ఎందుకు వృథాగా ఆరోగ్యంకూడ చెడగొట్టుకుంటారు?'

'సరూ! నీవంటి భార్య నావంటి దరిద్రుడికుండవలసింది కాదు. పొరపాటు. నీవు క్షమించా ననకపోతే......'

'ఛీ! తప్పు. మరీ చిన్నపిల్లలై పోతున్నా రేం?'

'ఆ వెర్రిమొర్రి పనులు మాని పడుకోండి.'

ఆమె దీపం తీసేసింది తలుపులు వేసి.

౧౨

విచారణ ప్రారంభమైంది జిల్లాకోర్టులో. మళ్ళీ విచారణ జరుగుతోంది. లీలావతి వ్యవహారం తొండముదిరి వూసరవెల్లి అయినట్టుగావుంది. ప్రతి విషయంలోను జోక్యం కలుగజేసుకొని సరోజినితో చిల్లికయ్యాలాడుతోంది. ఆమె యెంతో ఓర్పు వహించి వూరుకొంటోంది. కాని హద్దుమీరింది వ్యవహారం. సరోజినిదేవి లీలావతిని చెప్పుదెబ్బలతో సాగనంపింది. 'నీకు దిక్కువుంటే చెప్పుకో'మని.

కేసువిచారణ జరిగింది. పూర్తిఅయింది. జడ్జిమెంటులో చంద్రశేఖరంమీద కేసు తొలగించి మిగిలిన నలుగురికి కఠినశిక్ష విధించారు.

ఈ చేత చేసిం దాచేత అనుభవించవద్దూ?

ఫిలుం తాలూకు, స్టూడియో తాలూకు బాకీ లన్నీ రద్దుచేసి తాను కేసునుంచి తప్పించుకొన్నందుకు ఒకనాడు డిన్నర్ చేశాడు డైరెక్టరు.

లీలావతి పీడ వదలినందుకు సంతోషించాడు. అప్పుడు తెలిసికొన్నాడు ప్రేమవిలువ. సరోజిని తన ఆరాధ్యదైవమని భావించాడు.

ఎన్ని జరిగినా చివరకు డైరెక్టరనే పేరుమాత్రం సార్థక మైంది చంద్రశేఖరానికి.



# విజ్ఞానసాహిత్యవనం, బెజవాడ.

మీకు విజ్ఞానం కావాలా ?

అయితే—

మా విజ్ఞానసాహిత్యవనంలోనికి రండి !

మాసాహిత్యవనంలో రకరకాల పుష్పాలు పూస్తాయి. ఏరకానికి ఆరకం ఆయా విషయాల్లో అనుభవజ్ఞులైన వనమాలులే కృషిచేసి పెంచుతారు. వివిధ పరిమళాలతో విరాజిల్లు మా వనానికి ఒకసారి రండి. అందరికీ యిదే ఆహ్వానం !

ప్రవేశరుసుము రు 1. సంవత్సరంలో పుష్పించిన పుష్పాలఖరీదు రు 4.

---

వస్తోంది! రెండో పుష్పం !!

ప్రేమప్రేమ అంటారు, ప్రేమకోసం ప్రాకులాడతారు. అది దొరక్క నిరాశ చెందుతారు. దాన్ని అపార్థం చేసుకొని మోసపోతారు. అనేక అవస్థలపాలై పోతారు. చివరకు ప్రేమ దొరకదు.

ఇన్ని అవస్థలు పడకుండా—అసలు ప్రేమ అంటే యేమిటో, అందరికీ లభ్యమౌతుందో లేదో, తెలుసుకోవాలంటే వస్తోంది.

"ప్రేమ అంటే ?"

చదవండి, తెలుసుకోండి—అది యేమిటో !

అవకాశాన్ని పోగొట్టుకొని తరువాత చింతించకండి.

ప్రతులు తక్కువ ! త్వరపడాలి ! !

కావాలి !

మా సాహిత్యవనంలో పూచిన కుసుమాలు విక్రయించటానికి ఆంధ్ర దేశమందంతటా యేజంట్లు కావాలి. షరతులు చాల సులభం !

అట్లూరి పూర్ణచందర్రావు, మేనేజరు.

